

శ్రీరంగం, రంగనాయకస్వామి ఆలయంలోని ఏడు సింహద్వారాలలో మొదటి ద్వారం.

ఫొటో : ఎస్. సూర్యారావు—రాజమండ్రి.

| | | |
|---|---|---|
| సంవత్సర చందా<br>రు. 13-0-0<br>విడిప్రతిక 25 న.పై. | # ఆంధ్రపత్రిక<br>సచిత్ర వారపత్రిక | సంపుటము 52<br>సంచిక 17<br>18-12-57 |

**Founder : K. NAGESWARA RAO**

హేవిళంబి మార్గశిర, బహుళ ద్వాదశి బుధవారం


## విషయానుక్రమణిక ★

ముఖచిత్రం : నర్గీస్

★



ప్రధాని నెహ్రూ ఈ నెల 7 వ తేదీన మద్రాసు వచ్చారు. మౌంట్ రోడ్డులోని బాలభవన ప్రారంభోత్సవం చేశారు. ఒక బొమ్మను చేతుల్లో పైకెత్తి తెరవిడి పోయేట్లు చేశారు. శ్రీ నెహ్రూ ఉపన్యాసం శ్రద్ధగా వింటున్న బాలలను చిత్రంలో చూడవచ్చు.

# పిల్లలకోసం ప్రదర్శనమందిరం

ఇవ్వాళ పాలుతాగే పాపాయి రేపు జీవిత రణంలో సిపాయి. నేటి బాలకులు రేపటి పరిపాలకులు—దేశభాగ్య విధాతలు. పిల్లలను సరైన పద్ధతిలో పెంచి పెద్దవాళ్ళను చేసినప్పుడే పెద్దవారు తమ జీవితకర్తవ్యం నెరవేర్చుకున్నవారవుతారు. పిల్లల పెంపకంలో నిరక్ష్యం చూపే దేశం ఉత్తరోత్తరా నిర్వీర్యమవుతుంది. పిల్లల శారీరక, మానసిక వికాసానికి ఎంత ధనం, కాలం, శ్రమ వ్యయం చేసినా అది వృథా వ్యయం కాదు. ఈ దృష్ట్యా ఇటీవల మదరాసులో నెలకొల్పిన 'బాలభవనం' దేశమంతటికీ ఆదర్శప్రాయమైన ఉదాహరణ.

మద్రాసు, ఆంధ్ర కలిసి ఉండేరోజుల్లో 810 మంది శాసనసభ్యులుండేవారు. వీరికి 'కోట'లోని సభామందిరం చాలకపోవటం చేత, మౌంట్ రోడ్డులోని గవర్నమెంట్ ఎస్టేట్ ఆవరణలో కొత్తగా ఒక దివ్యమైన భవనం కట్టించారు. అక్కడ కొన్నాళ్ళు శాసనసభ సమావేశాలు జరిగాయి. ఇంతలో ఆంధ్రప్రాంతం విడిపోయింది. కిందటేడు కన్నడ, మలబారు ప్రాంతాలు కూడా విడిపోయాయి. మద్రాసు శాసనసభ్యుల సంఖ్య 205కు తగ్గిపోయింది. వీరికి అంత పెద్ద భవనం అనవసరమనిపించి మళ్ళీ పాత సభామందిరంలోకే మార్చారు. కొత్త భవనం చాలనాళ్ళు ఖాళీగానే ఉండిపోయింది. చివరకు దాన్ని బాలల వినోద ప్రదర్శనాలకు, వికాస కార్యక్రమాలకు ఉపయోగించాలని మదరాసు ప్రభుత్వం నిశ్చయించింది. ముఖ్యంగా పిల్లలకు యోగ్యమైన చలనచిత్రాలను ప్రదర్శించడానికి దాన్ని ఉపయోగిస్తారు.

69 ఏళ్ళు వచ్చినా, ప్రభుత్వ బాధ్యతలతో తలమునకలవుతున్నా, బాల్య సహజమైన ఉత్సాహంతో, గిలకలా చలాకీగా తిరిగే ప్రధానమంత్రి నెహ్రూ ఈ బాలభవనానికి ప్రారంభోత్సవం చేశారు. పిల్లల వినోదాలకి అంకితం చేసిన ఈ మందిరాన్ని పెద్దల సమావేశాలతో అపవిత్రం చేయవద్దని ఆయన సలహా ఇచ్చారు. ఆయన ఇంకా చెప్పిన విషయాలివి.

ఈ బాలభవనంలో మంచి డాక్యుమెంటరీలు, వార్తాచిత్రాలు, పిల్లలకోసం ప్రత్యేకంగా తీసిన కథాచిత్రాలు ప్రదర్శించాలి. ఇలాటి భవనాలు దేశంలో ఎక్కువైనకొద్దీ, పిల్లలకోసం ప్రత్యేకచిత్రాలు తీయడానికి ప్రోత్సాహమూ, ప్రదర్శించడానికి అవకాశమూ కలుగుతాయి. ఇతరదేశాలనుంచికూడా మంచి చిత్రాలు తెప్పించి ఇక్కడ చూపించవచ్చు. ఈ చిత్రాలద్వారా పిల్లలకు మనోవికాసమూ, మంచి అభిరుచులూ కలుగుతాయి. రష్యానుగురించి అనేకవిషయాల్లో మనకు ఏకాభిప్రాయం లేకపోయినా, ఒక విషయంలో మాత్రం ఏకీభవిస్తాము. ఆ దేశంలో పిల్లల పెంపకానికి, వికాసానికి చూపించే శ్రద్ధ చాలాగొప్పది. మనదేశంలో అటువంటి శ్రద్ధ ఇంకా ఏర్పడలేదు.

ఆ యీ సంగతులు ముచ్చటించిన తరువాత శ్రీ నెహ్రూ తన ఎదురుగావున్న బల్లమీది బొమ్మని పైకెత్తి చూపిస్తూ తెరవిడిపోయేటు చేసి, బాలభవనానికి ప్రారంభోత్స

(12-వ పేజీ చూడండి)

# అభినవ జీసస్

'ఈ చిన్న పిల్లడు పెద్దవాళ్ళకి నీతులు బోధించ వచ్చాడా అని హేళన చెయ్యకండి. నా మాటలు సాక్షాత్తు భగవంతుని మాటలే!'

ఆకల్లి ఆఫ్రికన్ బాలుని అద్భుతవాక్కులివి. ఆ బాలుని పేరు ఎలియాస్ మురంబదోరో. మధ్య ఆఫ్రికాలో ఇతడు జన్మించాడు. పుట్టుకతోనే ఇతనికి అన్ని పళ్ళూ ఉన్నాయట. ఈ విచిత్రం చూసి తండ్రి ఆశ్చర్యపోయాడు. ఇటువంటి శిశువు పుట్టాడేమిటా అని దిగులుపడ్డాడు. పిల్లవాడు మాట్లాడడం కూడా ప్రారంభించేసరికి ఇదేదో అపశకునమనుకుని తల్లినీ, పిల్లణ్ణీ ఇంట్లోంచి తరిమేశాడు.

తల్లిమాత్రం తన బిడ్డని చూసుకుని మురిసిపోయింది. పుట్టుకతోనే పళ్ళతో పుట్టాడంటే, సరాసరి స్వర్గంనుంచి వచ్చివుంటాడనుకుంది. ఏడాది తిరక్కుముందే ఆ బాలుడు క్రైస్తవ సువార్తలను బోధించసాగాడు. అయిదేళ్ళు నిండకుండానే అనేక ఆఫ్రికన్ భాషలలో బైబిలును మొదటినుంచి చివరికీ, చివరినుంచి మొదటికీ గడగడా చదివేవాడు. జీసస్ నా కడుపున పుట్టాడని ఆమె ప్రచారము చేసింది. ఆమె మాటలు అనేకులు విశ్వసించారు.

'సెంట్రల్ ఆఫ్రికన్ ఫెడరేషన్' రాజధాని శాలిస్‌బరీకి దగ్గరలో వున్న హారరీ అనే గ్రామంలో తొమ్మిది నెలల క్రితం ఎలియాస్ మొదటిసారిగా వేదిక అధిరోహించి మతబోధ ప్రారంభించాడు. ఆరేళ్ళబాలుడైనా అతని తీరులో ఠీవి వుంది. చూట్టానికి ముద్దొస్తూనే అందర్నీ శాసించే ధోరణిలో మాట్లాడాడు. అతని ప్రక్కనే అతని తల్లి తెల్లటిదుస్తులు ధరించి, చేతులు కట్టుకుని నెమ్మదిగా ప్రార్థన చేస్తూ నుంచుంది. వారిచుట్టూ కట్టుకోడానికి గుడ్డలయినా లేని దిసమొల పిల్లలు,



మధ్య ఆఫ్రికాలో క్రైస్తవ మతబోధ చేస్తూ అసంఖ్యాక ప్రజలను ఆకర్షిస్తున్న ఆకల్లి నీగ్రో బాలుడు మురంబదోరో.

అందముగా బట్టలు వేసుకొని అలంకరించుకున్న స్త్రీలు, పురుషులు గుమిగూడారు. తలపైకెత్తి, కళ్ళు మూసుకుని ఎలియస్ 'షోనా' అనే స్థానిక భాషలో ఉపన్యసించాడు: "నా మాట ఆలకించండి. పాపులారా! మన ప్రభువు శిలువమీద మరణించడానికి మీదే బాధ్యత. ప్రభువు మరణానికి పూర్వమూ, అనంతరమూ కూడా మీరు అసత్యవాదులుగా, చోరులుగా, జారులుగా జీవించడంవల్లనే ఆయనను శిలువపై కెక్కించి మేకులుకొట్టారు. మీ హృదయాలలోనికి, మీ గృహాలలోనికి ఆయన తిరిగిరావాలని ఉంటే పశ్చాత్తాపం పొందండి." ఈ ధోరణిలో సాగింది అతని ఉపన్యాసం.

చిలకపలుకులా సువార్తలను అప్పజెప్పడమే కాదు. ఎలియస్‌కు మతగ్రంథాల్లో కూడా మంచి ప్రవేశం ఉంది. సభలు ప్రారంభించిన రెండు వారాల్లోనే అతని సూక్తులు వినడానికి రెండుమూడు వేలమంది జనం గుమిగూడసాగారు. ఎట్లాంటి రోగాలైనా నయం చేస్తాడని వదంతులు నలుమూలలా ప్రాకాయి. రొడీషియాలో అన్ని ప్రాంతాలనుంచీ వందలాది వికలాంగులు, రోగపీడితులు అతని పాదసన్నిధికి రాసాగారు.

ఉత్తరదక్షిణ రొడీషియాలలో ప్రస్తుతం తల్లి, కుమారుడు బాహాటంగా పర్యటన చేస్తున్నారు. అతడు ప్రసంగిస్తూఉంటే మంత్రముగ్ధుల్లా నోళ్ళు తెరుచుకుని వింటారు జనులు. "ఈ చిన్న పిల్లడు పెద్దవాళ్ళకి నీతులు బోధించవచ్చాడా అని హేళన చెయ్యకండి. నా మాటలు సాక్షాత్తు భగవంతుని మాటలే." కాని ఇతని మాటలమీద రొడీషియాలోని క్రైస్తవ మిషనరీలకింకా నమ్మకం కుదరలేదు. క్రైస్తవ నీగ్రోలను అతని సభలకు వెళ్ళకుండా చేయాలని వారి ప్రయత్నం. ఇట్టెవెలుగువెలిగి ఆరిపోతాడా, లేక ఈ బాలుడు నిలదొక్కుకుని గొప్పవాడవుతాడా అని సంశయిస్తూ ఉన్నారు. ఎలియస్ ఇటీవల తన జీవితలక్ష్యం ఏమిటో చెప్పేశాడు. "ప్రపంచంలో కల్లా చిన్న బిషప్పును కావాలని నా కోరిక." ★

["టైమ్" నుంచి]

---

# ★ దివ్య స్మృతి ★

ఇదే జోహార్ - నీకిదె జోహార్!
విశాలాంధ్రదేశ జనకా!
మానధనుడవు - మహనీయుడవు
మహదాశయముల - మహోశీలుడవు

ఆంధ్రుల సఖ్యత సాధనకు
ఆంధ్రరాష్ట్ర సంస్థాపనకు
ఆమరణాంతపు దీక్ష వహించి
అసువులు బాసిన అమరజీవివి
త్యాగధనుడవు నీవయ్యా!
ఆదర్శవీరుడ వీవయ్యా!



చిరయశస్వి
15వ తేదీన వర్ధంతి.

దేశము నీ దేహంబని నమ్మి
స్వార్థరహితమౌ మహదాశయమున
సర్వోదయపు సమాజసిద్ధికి
నూత్న శకమునకు నాంది పలికిన
కార్యవాదివి నీవయ్యా!
రాజ తపస్వివి నీవయ్యా!
ప్రజాసేవయే పరమార్థమని
మానవసేవయె మాధవసేవని
గాంధీజీ ప్రియ శిష్యుడవై
గురువుని మించిన త్యాగము చేసిన
కర్మయోగివి నీవయ్యా!
స్వతంత్రయోగుడ వీవయ్యా!

—జి. వి. జె. కృష్ణ.




ఇటీవల ప్రజాస్వామ్య ఔషధాన్ని ఢిల్లీ చేత పెద్ద మోతాదులో తాగించారు. పార్లమెంటులోనూ, బయటా ప్రజాస్వామ్య జపమే హోరెత్తిపోయింది. కామన్వెల్తు పార్లమెంటరీ సమావేశాన్ని ప్రారంభిస్తూ రాష్ట్రపతి ప్రజాస్వామ్యాన్ని గూర్చి మాట్లాడారు. భారతదేశంలో పంచాయతీలు ముందు ముందు ఎక్కువ ప్రాధాన్యం వహిస్తాయని ఆయన అన్నారు. 'పంచాయతీలకు పోనుపోను ఎక్కువ అధికారాలిస్తే, గ్రామాలకు అవసరమైన పనులను గ్రామస్థులే చేసుకోవడానికీ, దానివల్ల కేంద్రప్రభుత్వపు పరిపాలనను పరిమితంచేసి ఉత్తమ ప్రభుత్వాన్ని రూపొందించడానికీ వీలుఅవుతుంది గదా' అని ఆయన ప్రశ్నించారు.

# ప్రజాస్వామ్యానికి నిర్వచనాలు

“ప్రజాస్వామ్యము అనగా అభిప్రాయ తాదాత్మ్యము కలవారి మధ్యనేగాక, అభిప్రాయ వైరుధ్యము కలవారిమధ్యగూడ సహజీవనమని అర్థము” అని ప్రధానమంత్రి నిర్వచించారు.

ఢిల్లీకి రాష్ట్రప్రభుత్వం ఉండేరోజుల్లో ఢిల్లీ ప్రజలు తమ ప్రవర్తనమూలంగా ప్రజాస్వామ్యానికి తాము అనర్హులమని ఋజువు చేసుకున్నారని శ్రీ కృష్ణనాయర్ ఢిల్లీ కార్పొరేషను బిల్లుమీద చర్చ సందర్భంలో పార్లమెంటులో అన్నారు.

ఢిల్లీ శాసనసభకు స్పీకరుగా పనిచేసి, ప్రస్తుతం ఝాన్సీ ప్రతినిధిగా పార్లమెంటు సభ్యురాలయిన డా॥ సుశీలానయ్యార్ ఢిల్లీ పాతప్రభుత్వ వ్యవస్థను సమర్థిస్తూ మాట్లాడారు. గాంధీజీమాటలు కొన్ని ఉదహరించి, ఈవిడకూడా ప్రజాస్వామ్యానికొక నిర్వచనం ఇచ్చారు.

మొదటి అభ్యంతరం: అసలు ఢిల్లీతరఫున మాట్లాడడానికి డా॥ సుశీలా నయ్యార్‌కు అర్హతలేదు. ఉంటేగింటే, లేడీ హార్డింజ్ కాలేజీలో చదివిందనే దొక్కటే ఆవిడకున్న అర్హత. ఢిల్లీశాసనసభకు ఎన్నికలు జరిగినప్పుడు ఆవిడ ఫరీదాబాదులో ఉండేది. ఫరీదాబాదు ఢిల్లీదగ్గర్లో ఉన్నా, పంజాబు రాష్ట్రంలోది.

రెండో అభ్యంతరం: ప్రజాస్వామ్యం అంటే పంచాయతీ రాజ్యమైనా, సహజీవనమైనా ఏదైనప్పటికీ, 'రాజకీయ సాహసికుల' పరిపాలన మాత్రం కాదు. ప్రజాస్వామ్యం అంటే “ప్రజలకొరకు, ప్రజలచేత ప్రజలయొక్క పరిపాలన” అని లింకన్ నిర్వచించినప్పుడు ఒక దేశంలో, రాష్ట్రంలో, నగరంలో నివసిస్తున్న ప్రజలనే ఆయన ఉద్దేశించారు కాని, ఇతరులని కాదు. స్వయంనిర్ణయాధికారాన్ని విల్సన్ సిద్ధాంతీకరించినప్పుడు దేశంలోని ప్రజల నిర్ణయాధికారమనే ఆయన ఉద్దేశం కాని విదేశీయులని కాదు.

ఇది పాతకథే: ఢిల్లీ రాష్ట్రపు మొదటి మంత్రివర్గంలో ముగ్గురు మంత్రులుండేవారు. వీరిలో డా॥ సుశీలా నయ్యార్ ఒకరు. జమా మిలియా ఇస్లామియా అలీఘర్ నుంచి ఢిల్లీకి మారినప్పుడు ఢిల్లీవచ్చిన కీ॥ శే॥ కిద్వాయ్ ఇంకొకరు. శాసనసభ స్పీకరు సర్దార్ గురుముఖ్ నిహాల్‌సింగ్.. ఈయనా ఒక స్థానిక కళాశాలలో ఉద్యోగంకోసం ఢిల్లీవచ్చినవారే. ఇప్పుడాయన రాజస్థాన్‌లో ఉద్యోగం చేస్తున్నారు గనుక “రాజస్థానీ” అయిపోయి ఉంటారు!

ఢిల్లీ మునిసిపల్ కమిటీ అధ్యక్షుడు శ్రీ ఆర్. ఎస్. అగర్వాల్ గార్ని బిర్లా సోదరులు ఢిల్లీలో ఉంచినంత కాలమూ ఆయనా ఢిల్లీ వాస్తవ్యుడే. ఢిల్లీ ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు పార్లమెంటులో కర్నాల్ నియోజకవర్గానికి ప్రతినిధి!

లోక్‌సభలో ఢిల్లీకి అయిదుగురు ప్రతినిధులున్నారు. ఒకామె శ్రీమతి సుచేతా కృపలానీ. ఈవిడ బెంగాలీలో ప్రమాణ స్వీకారం చేసింది. ఒకాయన శ్రీ కృష్ణనాయర్. ఈయన మలబారు మనిషి. ఢిల్లీకి రాజ్యసభలో ఉన్న ప్రతినిధుల్లో ఎస్. కె. డే. బెంగాలీ మనిషి. బీగంసదికా కిద్వాయ్ ఉత్తరప్రదేశ్ వ్యక్తి. ఇంకొకాయన లాలా ఓంకార్‌నాథ్. మొత్తం ఎనిమిదిమంది పార్లమెంటు (ఢిల్లీ) సభ్యుల్లో నిజంగా నలుగురే ఢిల్లీకి చెందినవారు. ఇతర్లకి ఢిల్లీ మీద స్వార్థంతో కూడిన ప్రేమ. అయితే, శ్రీ కృష్ణమీనన్ మలబార్ వారైనా బొంబాయికి ప్రాతినిధ్యం వహించడం లేదా, మెహర్‌చంద్ ఖన్నా బెంగాల్‌కు ప్రాతినిధ్యం వహించడంలేదా అని అడగవచ్చు. కాని కృష్ణమీనన్‌కు, కృష్ణనాయర్‌కు పోలికేమిటి? అదీగాక, బొంబాయి ప్రతినిధుల్లో సగం మంది ఇతర రాష్ట్రాలవారే అయితే బొంబాయి ప్రజలు మాత్రం ఎదురు తిరక్క ఊరుకుంటారా?

కాంగ్రెసుకు ఢిల్లీలో స్థానబలం లేదనేది బాధాకరమైన విషయం. కీ॥ శే॥ హకీం అజ్మల్‌ఖాన్, అసఫాలీ తప్పిస్తే ఢిల్లీ కాంగ్రెసుఅధ్యక్షులుగాపనిచేసినవారందరూ ఇతర చోట్లనుంచి ఢిల్లీకి లాభసాటి పదవుల కోసం వచ్చినవారే. దేశ విభజన తరవాత కాందిశీకులుగా రావడం సరే; అంతకు ముందుకూడా ఇలాగే జరిగింది. ఇలా కొత్తగా, కొంతకాలంపాటు ఉండడానికి వచ్చిన స్త్రీ పురుషు లెవరికీ ఢిల్లీ సంస్కృతి,

(10-వ పేజీ చూడండి)

శ్రీ కృష్ణ
[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

# పేరు మార్పు

పెండ్లి అయిన రెండో సంవత్సరములోనే మాకొక అమ్మాయి పుట్టింది. అప్పటికి మేము ముగురమయ్యాం. చుట్టుపక్కల పండు ముత్తయిదులంతా 'మీ అమ్మ 'సుబ్బమ్మ' పుట్టిందిలే', అని నన్ను అభినందించారు. మా అమ్మ నా చిన్నప్పుడే గతించింది. ఆమె రూపమే నాకు తెలియదు. మా అమ్మ తిరిగి ఉద్భవించిందని మహదానందం పొందాను.

విద్యార్థిదశలో శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి 'స్నేహలతా'దేవి కథ చదువుకున్నాను. స్నేహలతాదేవి తన వివాహవిషయంలో తండ్రి పడుతున్న కష్టాలు చూడలేక తనజీవితాన్ని అంతము చేసుకుంటుంది. ఇప్పటికీ ఆకథ నాకళ్ళకు కట్టినట్లుంది. పున్నామ నరకము నుండి రక్షించేవాడు పుత్రుడని, పుత్రిక కేవలం దాచిపెట్టబడి ఒకరికి అప్పగించబడే వస్తువని పురాణగాథల వల్ల తెలుసుకున్నాను. చదువుకున్న గాథలనుబట్టి, నిత్య జీవితంలో కళ్ళారచూస్తున్న అనేక సంఘటనలనుబట్టి ఆడపిల్ల అంటే అసహ్యముకల్గి, సంతోషము దిగజారిపోయి సంతాపం అధికమైంది.

ఇరుగుపొరుగు అమ్మలక్కలంతా 'పిచ్చివాడులా వున్నావు. ఈ రోజుల్లో ఆడపిల్లే నయం. అయ్యో! యిప్పటినుంచే దిగులెందుకు అబ్బాయ్! కట్నాలు కానుకలు తీసుకురాలేవనా!' అని నన్ను ఎంతగానో ఓదార్చారు.

దిగులు దిగమింగి మాతృశ్రీ తిరిగి పుట్టిందనుకున్నా.

బిడ్డపుట్టగానే చుట్టుపక్కలవారు, పరిచయముగల ప్రతి ఒక్కరూ "ఏం పేరు పెట్టావు?" అని అడగటం పరిపాటి. కొంతమంది తల్లిదండ్రులకు బిడ్డకు నామకరణం చేయుటమనేది ఒక పెద్ద సమస్యగా తయారవుతుంది. భర్త ఒక పేరు పెట్టాలంటే, భార్య మరొకపేరు పెట్టాలంటుంది ఇరువురు కొద్దిరోజులు వాదోపవాదాలతో యితరులను కూడా సంప్రదించటం కద్దు. ఇప్పటివారు పెద్దలపేర్లు పెట్టటం మనస్కరించక నాజూకు పేర్లకోసం వెదుకుతుంటారు. నాకు మా తాతగారిపేరు పెట్టారు. మా తల్లిదండ్రులు. మా అమ్మాయికి మా అమ్మపేరు 'సుబ్బమ్మ' పెట్టమని మా బంధువులు చాలామంది సూచించారు. సుబ్బమ్మ పేరు పెట్టటం సుతరాం నాకు యిష్టములేదు.

మాకు అమ్మాయి పుట్టిందని తెలుసుకున్న ప్రతి ఒక్కరు 'ఏం పేరు పెట్టారు? మీ అమ్మాయికి' అని నన్ను అడగటం మొదలు పెట్టారు.

'ఏదైన ఒక మంచిపేరు పెట్టాలనుకుంటున్నా' అని అంటుండే వాడిని.

దండా రామిరెడ్డి

"మీ అమ్మపేరు సుబ్బమ్మగదా! 'సు' మొదట అక్షరము గల ఏ పేరైనా పెట్టుకో చాల బాగుంటుంది", అని ఒక పంతులమ్మ సలహా యిచ్చింది.

"ఏమిటో! యిప్పటివాళ్ళ పేర్లే మాకు నోరు తిరగవు. మా కాలంలో మా పిల్లలందరకు పెద్దల పేర్లే పెట్టాం. ఏ మైనాగానీ మీ అమ్మపేరు పెట్టుకో ముచ్చటగా వుంటుంది", అని డెబ్బది సంవత్సరాలు నిండిన ఒక వృద్ధురాలు సలహాయిచ్చింది.

ఒక రోజున ఒక బాల్యమిత్రుడు కనిపించి 'అమ్మాయి పుట్టిందటగదా! ఏం పేరు పెట్టావు?' అని అడిగాడు.

'అందరూ మా అమ్మ 'సుబ్బమ్మ' పేరు పెట్టమంటున్నారు,' అన్నా.

'ఛా! నాన్‌సెన్స్, పూర్వకాలం మనిషిలా కనిపిస్తున్నావు రోజులు మారిపోతున్నాయి భారతావనిలో ఎందరో వీరనారీమణు లుద్భవించారు. 'ఝాన్సీ' పేరు పెట్టు భేషుగా వుంటుంది; అని వీపుచరచి అనేకమార్లు చెప్పాడు.

'అచ్చుగా పసిడిబొమ్మ. పసందైన పేరు పెట్టు' అని ప్రౌఢలు కొంతమంది సలహాలిచ్చారు.

ఈ తీరుగా మా అమ్మాయి నామకరణం

# పేరు మార్పు

విషయంలో అనేకమంది అనేకరకాలుగా సలహా లిచ్చారు.

ఒకరోజున భోంచేసి తీరిగ్గా కూర్చొని 'అందరూ రకరకాలుగాఅంటున్నారు. మరి నీవేమంటావు,' అని మాఆవిడను అడిగాను.

'పంతులమ్మగారి సలహా చాలబాగుంది. 'సు' అక్షరము మొదటవచ్చే పేరు ఏదైనా చూడండి బాగుంటుంది,' అంది.

ఆ విడతో ప్రసంగం ముగించి కాసేపు 'మనుచరిత్ర' కావ్యం చదువుకుందామని పుస్తకాలు వెదకుతున్నా. 'సుజాత' అనే ఒక పత్రిక కంటికి కనిపించింది. వెంటనే ఆ పత్రిక చేతబట్టుకొని మా వాళ్ళదగ్గఱకు వచ్చి ఆ పేరు వినిపించా. ఆ విడ ఆ పేరు వినగానే అమితానంద భరితురాలై. 'ముచ్చటగావుంది. ఈ పేరే ఖాయం,' అన్నది.

'సుజాత' హైదరాబాదునుండి వెలువడుతున్న ఒక మాసపత్రిక. గురుదేవులు శ్రీ శివశంకరస్వామిగారికి ఈ పత్రిక వస్తుండేది. అప్పుడప్పుడు కొన్ని సంచికలు తాకిస్తుండే వారు.

కొంచెం సేపు ఆగి 'సుజాత' అంటే అర్థం ఏమిటండీ? అని అడిగింది మా ఆవిడ. 'మనుష్యుల పేర్లకు అర్థాలు ఏమీవుండవు. కానీ ఈ పేరులో మాత్రము సుముహూర్తమున బుట్టిన,' అని అర్థమున్నది అన్నా.

ఒక మంచిరోజున మా అమ్మాయికి 'సుజాత' అనినామకరణంచేశాం. అడిగినవాళ్ళందరకూ 'సుజాత' అని చెప్పటం మొదలుపెట్టాం.

కొద్ది రోజులకు మా యింటి ప్రక్కాయన "అబ్బాయ్! అమ్మాయి పుట్టినసంగతి మునసబుగారికి చెప్పొచ్చావా?" అన్నాడు.

"మన అమ్మాయి పుట్టినసంగతి మునసబుగారి కెందుకండీ?" అన్నా.

"ఏమిటోయ్! ఆమాత్రం తెలియదా? గ్రామములోని జనన మరణ విషయాలు మునసబు గారికి వెంటనే తెలియజేయాలి. లేకుంటే అపరాధం," అన్నాడు.

నాకు వారిమాటలు విన్నప్పటినుండి అదోక భయంగావుండి మునసబుగారి దగ్గఱకు నేనొక్కడనే పోవటానికి ధైర్యముచాలక మా బావను వెంటబెట్టుకొని మునసబుగారింటికి వెళ్ళాను. సమయానికి వారు యింట్లోనే వున్నారు. పడకకుర్చీలో పండుకొని ఏదో చదువుకుంటున్న మునసబుగారికేసి చూస్తూ 'అయ్యా! నమస్కారమండీ!' అన్నా.

వెంటనే మునసబుగారు నన్ను ఎగాదిగా చూచి 'ఎవరు మీరు?' అన్నారు.

వెనకవున్న మా బావ వెంటనే అందుకొని 'మావాడేనండీ!' అన్నాడు.

'ఏం పనుండివచ్చారు?' అన్నాడు మునసబుగారు. మా బావ అందుకొని 'ఆ ఏమీ లేదండీ. మావాడికి ఓ అమ్మాయి పుట్టింది. ఆ సంగతి...'

"ఎన్నిరోజులైంది?"

"ఇవ్వాళటికి సరిగ్గా ఇరవైఆరురోజులైందండీ."

"ఇన్నిరోజులనుండి ఏం చేస్తున్నావయ్యా?" అన్నాడు కొంచెం కోపంగా మునసబుగారు.

'పసివాడు వాడికి తెలియదండీ,' అన్నాడు మా బావ.

మునసబుగారు నాకేసి చురచురా చూస్తూ,' 'ఏం చదువుకున్నావు?' అన్నారు.

'స్కూలుఫైనల్ రెండో సంవత్సరం ప్యాసయ్యానండీ' అన్నా.

"రెండో సంవత్సరం ప్యాసయ్యావు కాబట్టే నీ తెలివి తేటలు ఇంతలో వున్నాయి. బిడ్డపుట్టిన వారంరోజులలోపల మునసబుగారికి చెప్పాలన్న కామన్ సెన్సు లేకపోతే ఎట్లానయ్యా! ఏమిటో ఈరోజుల్లో బి. ఏ. చదువుకున్నా ప్రపంచజ్ఞానం శూన్యంగా వుంటున్నది. సరే. ఈ రోజున చెప్పినట్లే రికార్డులో వ్రాసుకుంటాను. తహశ్శీలుదారుగారు విచారించి ప్రథమతప్పుక్రింద క్షమించవచ్చు. లేకుంటే జరిమానా విధించవచ్చు" అన్నారు.

మునసబుగారు ఆమాటలు చెప్పగానే శరీరమంతా చెమటలుగ్రమ్మి గుండె అతి వేగంగా కొట్టుకుంటున్నది. చేతులు కాళ్ళు వణికిపోతున్నవి. నోటమాట రావటం లేదు. వణుకుతున్న రెండుచేతులెత్తి మునసబుగారికి దోహారులర్పిస్తూ, 'మీ పుణ్యముంటుంది. వారంరోజులక్రితమే పుట్టినట్లు వ్రాయండి. ఎప్పుడూ రచ్చకెక్కనవాడినిగాను. గుట్టుగా బ్రతికినవాడిని' అని దీనంగా ప్రాధేయపడ్డాను.

మునసబుగారు వీలు లేదన్నారు.

నా కనుదోయినుండి వేడి కన్నీటికణాలు జలజలారాలి క్రిందపడుతున్నాయి. మునసబుగారు ఆకన్నీరుచూసి జాలిపడి 'ఎందుకు కంట తడి పెట్టుకుంటావ్? మరేమి ఫరవా లేదు. భయపడకు' అన్నారు.

మునసబుగారి నోటినుండి ఆమాటలు విన్న తర్వాత అమ్మయ్యా! బ్రతికి బయటపడ్డానను కున్నా. గుండె దడతగ్గింది. కాళ్లుచేతులు మామూలుస్థితిలోకి వొచ్చాయ్.

రిజిష్టరు తీసికొని వివరాలన్నీ వ్రాసుకున్నారు. 'మీరు చేసిన ఈ మహోపకారం ఎన్నటికి మరువనండీ!' అన్నా.

వారు నవ్వి వూరుకున్నారు. కాసేపు పిచ్చాపాటీ కబుర్లతో కాలక్షేపంచేసి సెలవు తీసుకొని యింటికి బయలుదేరాం.

ఇంటికి వచ్చిన తర్వాత జరిగినదంతా మా వాళ్లకు పూసగ్రుచ్చినట్లు చెప్పాను. ఆవిడ నివ్వెరపోయి 'భలే! మునసబుగారే,' అంది. నాల్గు మాసాలు గడిచిపోయినయి. ఒకరోజు రాత్రి చదువుకుందామని లైటు తీసికొని నా పుస్తకాల గదిలోకి వెళ్ళాను. గదికి ఉత్తరపు వైపు గోడ ప్రక్కన

మూరెడు పొడవుగల ఒక తెల్లటి పాము పండుకొని వున్నది. 'అమ్మో! పాము,' అని ఒక్క వెఱ్ఱికేక వేశాను నా కేకకు ఉయ్యాలలో నున్న మా అమ్మాయి బిత్తర పోయి పెద్దపెట్టున ఏడుపు సాగించింది.

క్షణంలో మా వీధిలోని వారంతా మా యింట్లో గుమిగూడారు.

ఏనుగంత మనిషి మా మామ ఒకాయన బారెడు కఱ్ఱచేత బట్టుకొని ముందు నిలబడి నాకేసి చూస్తూ, 'ఎక్కడా? పాము,' అంటున్నాడు.

'వ్రేలెట్టి చూపెడుతూ – అదుగో అంటున్నా.'

'ఎక్కడా? మాకు కనబడందే,' అని అక్కడ చేరిన వాళ్ళంతా అంటున్నారు.

'నిజంగా నీ కంటితో చూశా వ్రా?' అని మా మామ నిలదీసి అడిగాడు.

'కలగంటున్నా ననుకుంటున్నా వా? కళ్ళార చూశా నయ్యా' అని కొంచెము ధైర్యంగా పలికాను.

"ఇదంతా సుబ్బారాయుడు మహిమ అయివుంటుంది. వాడికి అట్లా కనిపించి మాయమయ్యాడు. నేను చెప్పనే చెప్పాను మొదట్లో–మీ అమ్మపేరు పెట్టుకోరా అని. వాడు వింటే గదా' అని ఒక ముసలమ్మ పలికింది.

'వాడు గట్టిగా చూశానంటున్నాడు. పందికొక్కు కన్నాల్లోకి ఏమైనా జారిం దేమో! నా కనుమానంగా వుంది' అన్నాడు ఒక మిత్రుడు.

"ఇన్నెందుకు? రేపు సోది అడిగితే అన్ని సంగతులు తెలుస్తయి" అంది ఒక పెద్దముత్తైదు.

'సోదిలో ఏముంది? బియ్యంఖర్చు కానీ. కళ్ళార చూశానంటున్నాడు ఎక్కడ దాగివుందో?' అంది చదువుకున్న ఒక జవరాలు.

ఇట్లా చేరిన వాళ్ళంతా తలోక అభి ప్రాయ మిచ్చారు. చివరకు 'రేపు సోదడిగి తెలుసుకోండి', అని తీర్మానించారు.

వాళ్ళ తీర్మానము ననుసరించి మరుచటి రోజు ఉదయం సోదెమనిషిని పిలిచి సోలెడు బియ్యముపోసి సోదె అడగటం మొదలుపెట్టింది మా ఆబిడ ఇరవైమందికి పైగా యిరుగుపొరుగు అమ్మలక్కలంతా చుట్టూచేరారు.

ఆరంభించిన అరునిమిషాలకే సోద సరిగా రావటంలేదని చేరినవాళ్ళంతా మూతులు విరిచారు.

సోదెమనిషికి కొంచెం కోపమువచ్చి నా ప్రతిభ చూడండీ అంటూ గంటసేపు గంభీరంగా చెప్పింది. గప్‌చిప్పుగా విని అమ్మలక్కలు ఎవరింటికి వాళ్ళు వెళ్ళి పోయారు.

'ఇంతకూ సోదెమనిషి చెప్పిన సారాంశ మేమిటి?' అని మావాళ్ళను అడిగాను.

'మీ అమ్మవచ్చింది అమ్మాయికి తన పేరు పెట్టుకోలేదని ఆరూపంలో కనబడిం దంట. ఇప్పుడైనా సుబ్బారాయుడు స్వామికి మ్రొక్కుకొని తనపేరు పెట్టుకో మన్నది. ఇంకా ఆలస్యముచేస్తే ఆపదలే వస్తాయంట. ఏపేరైతే ఏముంది. అట్లాగే మీ అమ్మపేరు పెట్టుకుందాం,' అంది మా ఆబిడ.

"సరేనన్నా"

ఒకమంచి రోజుచూసి సుబ్బారాయుడు స్వామికి ధూపదీపనైవేద్యము పెట్టి సాగిలపడి నమస్కరిస్తూ "ఈరోజునుండీ మా అమ్మాయిని 'సుబ్బమ్మ' అని పిలుచుకుంటాం. చేసిన తప్పు క్షమిం చండీ ఆపదలు రానీక హమేషా మమ్మల్ని కాపాడండి" అని ఇరువురం మొక్కున్నాం.

ఆ రోజునుండీ మా అమ్మాయి పేరు సుబ్బమ్మగా మారిపోయింది.

మా అమ్మాయి పుట్టి సంవత్సరం పూర్తి అయింది. పుట్టినరోజు పండుగ కూడా చేసు కున్నాం.

పూర్వులు కట్టిన పాతయిల్లు మాది. పంది కొక్కు కన్నాలతో నానాటికి శిథిలమై పోతున్నది. కన్నాలన్నీ పూడ్చి, కడపరాళ్లు పరపించుకుందామని తాపీవాళ్ళను పిలిచి పని మొదలుపెట్టించాను. ఇల్లంతా త్రవ్వి చదునుచేస్తున్నారు. ఒక కన్నములోనుంచి పాము బుసకొడుతూ బయటికి వస్తున్నది.

'అమ్మో! పాము' అని అన్నారు అందరు గోలగా. ఇంతలో మా ప్రక్కింటాయన కఱ్ఱ తీసికొనివచ్చి ఒక్కదెబ్బతో ఆ పామును చంపేశాడు.

'ఆ రోజున నా కంటికి కనిపించింది ఈ పామే అయివుంటుంది. అందరూ కాదని వాదించి సుబ్బారాయుడు మహిమ అంటూ ముచ్చటగా పెట్టుకున్న పేరు అంతలోకి మార్పించారు. ఏమిటో! 'అంతా తమాషాగా జరిగిపోయింది' అన్నా మా వాళ్ళతో.

'ఇంతకూ మనం అదృష్టవంతులం. పేరు కేమిలెండి. భగవంతుడు మనలను ఒకకంట కనిపెట్టే వున్నాడు. అందరూ త్రాచు పామంటున్నారు. కాటేస్తే ఇంకేమైనా వుందా!' అంది మా ఆవిడ. ★

# న్యూఢిల్లీ లేఖ

(5-వ పేజీ తరువాయి)

సంప్రదాయమూ, అవసరాలు ఏమీ తెలియవు. ఢిల్లీ మాజీ ఆరోగ్య మంత్రిణి ఢిల్లీ జాస్తవ్యురాలే అయిన పక్షంలో పాత ఢిల్లీ పెరేడ్ మైదానంలో మార్కెట్ నిర్మించే పథకానికెప్పుడూ సమ్మతించేది కాదు.



ఢిల్లీ ముఖ్యమంత్రీ, ఆరోగ్యమంత్రిణీ పదవులకోసం పేచీలు పడడాన్నే ఉదహరిస్తున్నట్లయితే, శ్రీ కృష్ణనాయర్ చెప్పింది సబబే. ఈ పేచీలలో ఢిల్లీ ప్రజల ప్రసక్తే లేదు. అమెరికాలో రెడ్ ఇండియన్లమాదిరే ఢిల్లీ ప్రజలుకూడా నశించిపోతున్న జాతి. సహజీవన సిద్ధాంతమే వారికొంప తీసింది. 1912నుంచీ ఈ సిద్ధాంతాన్ని వారు నమ్ముకుని ఉన్నారు.

ప్రజాస్వామ్యానికి ఇంకో నిర్వచనం ఉన్నది: గట్టిగా గలభా చెయ్యగలిగినవాడి పరిపాలన! రాజ్యాంగవేత్తకు, ప్రజాహిత చింతకునికి, ఒక్క ముక్కలో చెప్పాలంటే సజ్జనుడైన వానికి ఢిల్లీ ప్రజాస్వామ్యంలో తావులేదు. భయస్థులకు మాత్రమే శాసనాలు; వారే వాటిని శిరసా వహించేది. పార్లమెంటు శాసనాలు చేస్తుంది. కాని గలభాదార్లకు శాసనాలను వమ్ముచేసే మార్గాలు బాగా తెలుసు. ఓ చిన్న ఊరేగింపు లేకది సేది, న్యూఢిల్లీ వీధుల్లో ప్రదర్శనలు చేసేదీ. మర్నాటికల్లా ప్రభుత్వం దాసోహం అనేస్తుంది.

న్యాయం చెయ్యాలనీ, అందర్నీ సమానంగా చూడాలనీ, కొన్నివర్గాల ప్రజలకు గాక, జనులందరికీ అవసరాలు తీర్చాలనీ ప్రభుత్వం కృషిచేయడంలేదు. ఉద్రేకాలను తగ్గించడమే ప్రభుత్వానికి ముఖ్యలక్ష్యంగా కనిపిస్తుంది. "ఉద్రేకాలతగింపు" బహుశా ప్రజాస్వామ్యాని కింకొక నిర్వచనమేమో! కొందరు పార్లమెంటు సభ్యులూ, ప్రజల్లో పలుకుబడికోసం పాకులాడే మంత్రులూ శాంతిభద్రతలను నాశనం చెయ్యడానికి యథాశక్తి కృషి చేస్తున్నారు. ఒక ఉదాహరణ: పార్లమెంటు సభ్యులు 'భేష్' అని హర్షించినతరవాత న్యూఢిల్లీ పాకీ వారు పని పూర్తిగా మానెయ్యలేదుగాని,మానేసినంతపనీచేశారు. అశుభ్రతకు కారకుడుగా ప్రజలంతా నిందిస్తున్న ఆరోగ్యశాఖాధికారి క్రమశిక్షణను నెలకొల్పడానికి ఎంతో ప్రయత్నం చేశాడు. కాని ఒకానొక పార్లమెంటు సభ్యుడు "పీడిత" పాకీపనివారిని వెనకేసుకుని వచ్చి పెద్ద అధికారులకు విజ్ఞప్తి అందజేశాడు. వెంటనే ఆరోగ్యశాఖాధికారిని చివాట్లువేసి న్యూఢిల్లీ పాకీ పనివారిని గౌరవంగా చూడాలని ఆదేశించడం జరిగింది.

కులరహిత, వర్గరహిత సమాజ స్థాపన లక్ష్యంగా గల ప్రజాస్వామ్యానికింకో ఉదాహరణ: 'కాబినెట్' హోదాలేని మంత్రి ఒకాయనకి పంటిబాధ వచ్చింది. విలింగ్డన్ ఆస్పత్రిలో ఒక దంత వైద్యుని దగ్గరకు వెళ్లడానికి నిశ్చయించుకున్నారు. ఆస్పత్రికి రావడంతోనే, దంతవైద్యుడు తనకోసం గేటుదగ్గర కాసుకుని కూర్చుని ఎదురు రాలేదని మంత్రిగారికి కోపం వచ్చింది. వెనక్కి వెళ్లిపోయారు. దంత వైద్యుడికి మర్యాద తెలియదని ఫిర్యాదు చేశారు. ఉద్రేకాలు తగ్గించడమే ప్రభుత్వ లక్ష్యంగా ఉంది గనుక, మంత్రిగా లేవరైనా వస్తున్నారని అనుమానం తోచగానే ప్రభుత్వోద్యోగులంతా గౌరవ విన్యాసాలు అవీ ఏర్పాటుచేయాలని హోంశాఖ ఒక ఉత్తర్వు జారీచేస్తే బాగుండును!

"పార్లమెంట్ ఇన్ ఇండియా" అనే పుస్తకంలో డబ్ల్యు హెచ్. మోరిస్ ఇలా వ్రాశారు:

"ఢిల్లీ రాష్ట్రంలో ఇంకా విపరీతాలు జరిగాయి. 1953 అక్టోబరులో అసంతృప్తి సూచనలు బాగా కనిపించాయి. అసెంబ్లీ పార్టీని సమావేశంచేయాలని ఒత్తిడి జరిగింది. మద్యం లైసెన్సు లివ్వడం గురించి, మంత్రులకు "భక్తులు" ధనంబహూకరించడంగురించి ప్రశ్నలడిగితే ఏవోసాకులుతప్ప సరైన సమాధానా లివ్వనందుకు మంత్రులను సభ్యులు దుయ్యబట్టారు. కొంత సదు మణిగాక 1954 మార్చిలో మళ్ళీ రగడ రేగింది. పార్టీ నాయకుడు ఒక సభ్యుణ్ణి సస్పెండు చేశారు. పార్లమెంటరీ బోర్డు దర్యాప్తుచేసింది. పండిట్ నెహ్రూ మంత్రులను, వారి విమర్శకులను విచారణచేసేదాకా సస్పెన్షను ఉత్తర్వును నిలుపుచేయాలని ఆదేశించింది. 1954 జూన్‌లో ఆ ఉత్తర్వును ధ్రువపరిచారు. ఇదే అదను అని ప్రవర్తన, క్రమశిక్షణ గురించి కాంగ్రెసు అధ్యక్షుడు ఏవో ఉద్బోధలు చేశారు. అయినా మరి రెండేళ్ళలో విమర్శకులదే పైచెయ్యి అయింది. 1956లో ముఖ్యమంత్రిని తొలగించారు. అసెంబ్లీ స్పీకరును పార్టీ నాయకత్వాని కెన్నుకున్నారు. చిన్నచిన్న రాష్ట్రాలలో రాజకీయ చాకచక్యం కొరతగా ఉందనీ దీనివలన తేటతెల్లమైంది. భారతదేశంలో స్పీకరు ఇక తనకు రాజకీయ భవిష్యత్తు లేదని బెంగపెట్టుకో నవసరంలేదనికూడా దీనివల్ల స్పష్టమవుతుంది." ★







"శ్రీ రాజా! అదీసంగతి. అంచేత కిందటి వారం పన్నెండో పేజీలోపడ్డ తెలివి తేటలు నీ దగ్గ రున్నాయా? ఆ కథలో వాళ్ళలా నువ్వు అటువంటి సమస్యను అలా ఎదుర్కొన గలవా?" అన్నాడు కొలంబస్, గంభీరంగా అటూఇటూ చూసి.

"ఇంకా అన్ని లేవుసార్" అన్నాడు రాజు విచారపడిలేస్తూ.

"అయితే యూస్‌లెస్ లాభంలేదు" అన్నాడు కొలంబస్.

"అదేమిటిసార్. మొదట్లోనే లాభం లేదనేస్తే ఎలాగండి."

"రైటే ననుకో. ఓపిక్చరు ఫ్లాపుఅయి దెబ్బతింటేనేగాని, అనకూడదు. అదినీ అయిడియాలే." అన్నాడు కొలంబసు.

"ఔనుగానిసార్. అడగడం మర్చిపోయాను. ఇప్పుడు మనంచూసిన పిక్చరు పేరేమిటిసార్?"

"బ్రదర్! ఇది బావులేదు. ఒక్క డైలాగులో రెండుసార్లు 'సార్'లు వాడేవు. నువ్వెందుకు పనికొస్తావు."

"నేనాండి!" అని ఉత్సాహంతో లేచిపోయాడు రాజు "నేను హీరో, హీరోయను, రేలంగి, రంగారావు, తంగవేలు, వేదములు, గుమ్మడి, పెరుమాళ్ళు, లాంటివి, సూర్యకాంతం, వంగరలగా నటించబడును. ఇంకా డ్యూఎట్లు పాడి, రాసి పెట్టబడ గలను. డైలాగులు లేనిరోలు ఇచ్చినా ముహం నిండా ఫీలింగులు పెట్టేసి అమోఘముగా నటించిపెట్టబడును."

"హోల్డాన్ రైట్...ఎరక్క అన్నానయ్యా. ఆ మాట' అని విసుక్కున్నాడు కొలంబస్.

రాజుమనసు చివుక్కుమంది. నొచ్చుకున్నాడు. కాస్సేపాగి, నవ్వుటనభినయించి, అయితే ఈపిక్చరు పేరు చెప్పారు గాదు' అన్నాడు వినయంగా.

కొలంబస్‌కు జాలేసింది.

తారకమంత్రం ఉపదేశిస్తున్న సన్యాసిలా మందహాసంచేసి, వాత్సల్యంతో రాజు వీపు తట్టాడు.

"వాయనా రాజా. ఎంతఅమాయకుండవు ...ఆలకించు. మనం దేవుళ్ళని రాముడనీ, కృష్ణుడనీ, అల్లాఅనీ, ఇల్లాఅనీ పిలుచుకుంటాం. పేరు వేరుగాని, దేవుళ్ళందరు లేరు. ఈశ్వరుడొక్కడే. అతనికి అనేక రూపాలు. అనేక నామాలు. అతను మన సినిమాల్లాగే ఆదిమధ్యాంతరహితుడు. వాయనా రాజా! మన సినిమాలలో ఈ ఈశ్వరదర్శన రహస్యం దాంకుని ఉందన్నమాట. ఇది సరిగ్గా అంతే. "సుబ్బలక్ష్మి" అంటావు ఓ సినిమాని. "నూరజ్" అంటావుమరోదాన్ని. 'మురళీవ ధూళో' అంటావు ఒక పోషర్‌ని. అలాగే బంగారుపువ్వు, పెండిబండి, అట్టిబుట్ట, చెక్కచెక్క. ఇలా నవాలను పేర్లు. కాని, సినిమాలోకి అవన్నీ ఒకటేగదా. వాటికి భాషా ప్రాంతం అనే భేదాలు లేవుగదా. నిజానికి భాషా అనే భేదాలు లేవుగదా. మొదలూ తుదీ, తలా తోకా అనే పట్టింపులు లేవుగదా. నువ్వు ఓ పిక్చరు మాటినీ ఆట చూస్తావు. రెండో ఆట ఇంకోచోట చూడు. మాటినీ ఆటలో ఆఖరిసీనుతో ఇది మొదలవుతుంది. దాని మొదటిసీనుతో అఖ్క చేస్తారు. నాలుగురీళ్ళు సుఖపడితే ఆఖరిళ్ళు చేసికొన్నిళ్ళు. మధ్యమధ్య నాలుగురీళ్లు పోస్తాపు దన్నిళ్ళు. ఇంకో పదమూడురీళ్ళలో కథ అవుతేనీ, ఇవాన్నెనలికి వదలిపెడ్తారు. ఇంతేగదా. వాయనా." అన్నాడు కొలంబస్.

'ఇంతే ఏమిటండి. కాదండి. నాకు కొద్దిగా ఇష్టముందా తెలిసికొనగలిగినంత డైలాగు మాట్లాడారు' అన్నాడు రాజు వినుగా.

"సరిగ్గా ఇంతే బ్రదర్. ఎడిటింగ్ అంటే ఇదే. నీవు ఉందనుకుంటున్న కొద్దిని పిక్చరు విడుదలయేనాకో ఉందని గారంటీ లేదు. సినిమాలో, ఏ నూరు గుండ్రని తేలా

# విక్రమార్కుడి మార్కు సింహాసనం

ఎవడో కొట్టాడనుకో. ఎవరో పెద్ద స్టారు నీ తాలూకు బాధను క్లోజప్‌లో నటిస్తాడు. నిన్నెవడో తిట్టాడనుకో పెద్ద వాళ్ళెవరో కోపం నటిస్తారు. ఆఖరికి నీ కాలు జారిం దనుకో. నీ బదులు ఇంకెవరో పడతారు. వీటి నే 'ఫిట్టింగులు' అనబడును లే. ఇందాక అడిగావుగా అందుకు చెప్పాను. అలా కోడిలా చూడకు నాకేసి—" అన్నాడు కొలంబస్.

రాజు, భయపడ్డకోడిలా చూస్తున్నమాట నిజమే. కాని, ఆ చూపుల చివర కొలంబస్ లేడు. అవి అతన్ని దాటిపోయాయి, మాంత్రి కష్టాల ఘట్టంలోఉన్న కారెక్టర్ యాక్టర్‌లా రాజు నిర్వికారవదనుడై, నిశ్చేష్టుడై, నిర్విణ్ణుడై చూస్తున్నాడు. (సశేషం)

# పిల్లలకోసం ప్రదర్శన మందిరం

(3-వ పేజీ తరువాయి)

నం చేశారు.

మద్రాసు ఆర్థికమంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యం బాల చలనచిత్ర సంఘం తరఫున మాట్లాడుతూ పెద్ద వాళ్ళ కోసం తీసిన సినిమాల్ని పిల్లలుచూసి చెడిపోతున్నారనీ, పిల్లలకోసం సినిమాలు తీసి చూపించకుండా పెద్దల సినిమాలు చూడవద్దని చెబితే ఎవరూ మానరనీ, అందుకే పిల్లలచిత్రాల ఆవశ్యకత ఎంతైనా ఉందనీ చెప్పారు. పిల్లల చిత్ర నిర్మాణ, ప్రదర్శనలకోసంగాను, అఖిల భారత స్థాయిలోను, రాష్ట్రస్థాయిలోనూ సంఘా లేర్పడి పనిచేస్తున్నాయనీ, ఈ సంఘాలు తీసిన చిత్రాలను, విదేశాలలో తయారైన బాలచిత్రాలనూ ఈ భవనంలో ప్రదర్శిస్తామనీ ఆయన చెప్పారు.

సభకి అన్ని పాఠశాలలనుంచీ పిల్లలు అసంఖ్యాకంగా వచ్చి నెహ్రూ గారి మాటలు శ్రద్ధగా విన్నారు. "జలదీప్" (లైట్ హౌస్) అనే ఒకచిత్రము ప్రదర్శించారు.

తాత్కాలిక గవర్నరు శ్రీ రాజమన్నారు, ప్రభుత్వాధికారులు, సినిమా కళాకారులు, న్యాయమూర్తులు, పురప్రముఖులు,పిల్లల తల్లి దండ్రులూ అనేకులు సభకుహాజరయ్యారు.



# స్వయంవరం

సి. డి. యస్. రామయ్య

బాగా తెలతెల వారింది...

మద్రాసు సెంట్రల్ స్టేషనులో— బెజవాడ ప్యాసింజరు బయలుదేరడానికి సిద్ధంగావుంది.

స్టేషనుముందు ఒక ఆటో—రిక్షా ఆగింది. దానినుండి కమలా, సరోజినీలు దిగారు. సరోజిని చేతిగడియారం చూసుకుని "మైగాడ్!... ట్రెయిన్ బయలుదేరడానికి అయిదు నిమిషాలుగూడా లేదనుకుంటాను!" అంది, ఆతురతతో!

సరోజిని టిక్కెట్టు కొనడానికి లోపలికి నడిచింది. కమల ఆటోవాడికి కిరాయిడబ్బు లిచ్చి, స్టేషన్‌లో సరోజినిని కలుసుకుంది. ఇద్దరూ ఆతురతగా బండినిలిచిన ప్లాటుఫారంవేపు నడిచారు.

గంట గణగణ మ్రోగింది...

"సరూ! ఇంకా అలావెళ్ళి అందులో కొస్తే, ఈ పెట్టెలోనే ఎక్కకూడదూ!" అంటూ దగ్గరనిపించిన ఆఖరిపెట్టెలోకి తీసుకువెళ్ళింది. సరోజిని యేంమాట్లాడలేదు. హేండ్‌బాగ్ లోపలపెట్టి, పెట్టెలోకి యెక్కింది.

"సరూ! వెళ్ళగానే వుత్తరం రాయి!"

"అలాగే కమలా!"

"ఒంటరిగా ప్రయాణం చేస్తున్నావ్! జాగ్రత్త సుమా!"

"థాంక్స్..."

గార్డు విజిల్ వూదాడు.

"వెళ్ళొస్తాను కమలా!"

సరోజిని హస్తాన్ని తనచేతుల్లోకి తీసుకుని, "శుభంగా వెళ్ళిరా!... నువ్వు బయలుదేరేముందు వుత్తరంరాయి! నేను స్టేషన్‌లో కలుసుకుంటాను. మరిచిపోకు" అంది కమల.

'ఊఁ' అని నిట్టూరుస్తూ రైలుకదిలింది.

"టాటా!" అంది సరోజిని, కిటికీలోంచి చేయివూగిస్తూ. ఆమెను చూస్తూ—ప్లాటుఫారంమీదే నిలబడిపోయింది కమల. క్రమంగా దూరమయిపోతున్న బెజవాడ ప్యాసెంజరులోని తన స్నేహితురాలిరూపం పూర్తిగా కనుమరగిపోయింది. ఆ బాధను వ్యక్తంచేస్తూ—భారంగా ఒక్కనిట్టూర్పు విడిచింది.

* * *

ప్రయాణపు ఒడిదుడుకులతో తబ్బిబ్బైపోయిన సరోజిని మనస్సు స్థిమితపడేసరికి అరగంటపైగా గడిచింది. అప్పటివరకూ తన చుట్టూ పరిస్థితుల్ని గురించి ఆలోచించడానికైనా ఆమెకు తోచలేదు. కొన్ని స్టేషన్లు గడిచిన తర్వాత, తను ప్రయాణంచేస్తున్న కారేజిపరిస్థితి గమనించింది: అందులో అట్టే జనంలేరు.....పది, పన్నెండుగురు తప్పితే! ఆ పైన ఓ ముసలిదంపతులు— మనుమరాళ్ళు గాబోలు—ఇద్దరు అమ్మాయిలతో ముచ్చటలాడుతున్నారు. అయిదారుగురు యువకులు సిగరెట్టు కాల్చుతూ, సినిమాల్ని గూర్చి తర్కించుకుంటున్నారు. తనకెదురుగా ఒకతను దినపత్రిక ముఖాని కడ్డంపెట్టుకుని జపంచేస్తున్నాడు; అతని ప్రక్కగా దాదాపు మూడేళ్లు వయస్సుగల ఒక అబ్బాయి నిలుచుని, కిటికీగుండా ప్రకృతిని చూస్తున్నాడు. మిగతా వాళ్లు పిల్లా కలిసి నలుగు రైదుగురున్నారు. చుట్టూరా వున్న వ్యక్తుల్ని చూసిన తర్వాత, తను ప్రయాణంలో యేమీ యిబ్బందులు పడనవసరం వుండదని నిశ్చయించుకుంది.

పొద్దుపుచ్చడంకోసం చదువుకోడానికి తెచ్చుకున్న వారపత్రికను విప్పి చదువుకోవడం మొదలెట్టింది సరోజిని. అలా కొంతసేపు గడిచింది.

తన సమీపాని కెవరో వచ్చినట్లు అలికిడి వినిపించి—తన చూపు పుస్తకంమీదినుంచి ముందుకు మరల్చింది. ఇంతకుముందు, తన కెదురుగా కిటికీ దగ్గర కనిపించిన అబ్బాయి—తనకేసి చూస్తూ నిల్చున్నాడు. నిక్కరూ, బుష్‌షర్టు తొడుక్కుని వున్నాడు. శాస్త్రయుక్తంగా పుష్టిగా—కుడి పాపిడితీసి, నున్నగా దువ్వుకున్న క్రాఫుతో—ముద్దుగా, తనకేసి వింతగా చూస్తున్నాడు. అతని కేసే ఓ నిమిషంపాటు చూస్తూ వుండిపోయింది సరోజిని. ఆ తర్వాత అతడు ముఖం తిప్పి తిప్పి తన కేసి చూడ్డంతో—సరోజినికి నవ్వాగింది కాదు!

"ఏందుకలా చూస్తున్నావ్ బాబూ?" అని నవ్వుతూ ప్రశ్నించింది సరోజిని.

వాడూ నవ్వాడు: "చూస్తే యేం?" అన్నాడు.

వాడి ముద్దులొలికే మాటలు ఇంకా వినాలనే కుతూహలంతో—సరోజిని వాడ్ని దగ్గరికి తీసుకోబోయింది. కాని, వాడు తప్పించుకుని, ఆ కూర్చున్న అతని వద్దకు వెళ్ళిపోయాడు.

"మోహన్! రైల్లో యేమిటి నీ అల్లరి? ఒక్కచోట కూర్చోరాదూ!—" వాడి అల్లరిని ఖండిస్తున్నట్లు—అతని నన్న మాటలకి సరోజిని మనస్సు కాస్త బాధపడింది.

మోహన్! రూపానికి తగట్టు—ముద్దులొలికే పేరు! అనుకుంది సరోజిని.

అతని దగ్గర నిశ్శబ్దంగా కూర్చుని సరోజిని కేసే చూస్తున్నాడు మోహన్. వాడి వాడిచూపులోని భావమూ, ఆప్యాయతా—సరోజినిని మళ్ళీ పుస్తకంవేపు తిప్పలేక పోయాయి. అయిదు నిమిషాల వరకూ తనూ—ఆ పిల్లాడి వేపు చూస్తూ— చిరునవ్వులు చిలికిస్తూ వుండిపోయింది. అంతలో వాడి ముద్దుముఖంలో విషాద రేఖలు అలుముకున్నట్టు ఆమెకు తోచింది. అలా ముంగమూతి పెట్టుకుని, తనను చూస్తూ కొంతసేపు మౌనంగా కూర్చున్నాడు. వాడి చూపులోని అర్థమేమిటో అర్థంగాక సరోజిని ఆలోచించసాగింది. అంతలో మోహన్— దినపత్రిక చదువుతున్న ఆ వ్యక్తికేసి తిరిగాడు:

"నాన్నా! నాన్నా!!"—

"ఏమిటిరా?" అన్నాడతను, పత్రిక నుండి దృష్టి మరల్చకుండానే!

"మరే! అమ్మ యెలా వుంటుంది చెప్పూ?"

"ఎలా వుంటుంది? బాగానే వుంటుంది."

"అయితే...అమ్మ యెందుకు చచ్చిపోయింది నాన్నా?"

"జీవించవలసినకాలం పూర్తయిపోయింది గాబట్టి - చనిపోయింది...అంతే!"

"మరి, అమ్మ ఛాలా బాగుంటుందా?"

“అవును; బాగుంటుంది. అమ్మ చాలా మంచిది.”

“అమ్మ నన్ను చూసి నవ్వుతుందా?”

“ఊఁ! నవ్వుతుందీ; దగరికి రమ్మని పిలుస్తుందీ; ముద్దుపెట్టుకుంటుంది గూడా!”

“అయితే, అమ్మ చచ్చిపోలేదు; అమ్మ నాదగ్గర వుంది! నాదగ్గరే వుందీ” అంటూ ఆనందంలో చప్పట్లు కొట్టసాగాడు.

“ఏమిట్రా వాగుడూ? ఏదీ అమ్మ?” అంటూ ముఖంమీదినుండి పత్రికను తీసి మోహన్‌ను అడిగాడతను.

“అదిగో, అమ్మ!” అంటూ సరోజినికేసి వేలెత్తి చూపి నవ్వాడు మోహన్. అంతులేని ఆశ్చర్యంతో - ఆ యువతివేపు మొట్టమొదటగా చూశాడు ఆ యువకుడు.

ఆమె గూడా అప్పుడే చూసింది!

ఆమె ముఖంలో కోపంముసుగుకప్పుతున్న సిగ్గు వ్యాపించింది. అబ్బాయినీ, అతన్నీ—మార్చి మార్చి చూసింది. ఆ చూపుల చివరి దృశ్యంలో—అతనికీ, ఆమెకూ మధ్య చిరునవ్వులు మొలకలెత్తాయి.

తర్వాత, అతనన్నాడు: “సారీ! మరేమనుకో రనుకుంటాను!”

“అబ్బే! అనుకోడానికేముందండీ! చిన్నపిల్లాడు...నూరు మాటలన్నా ఓర్చుకోవలసిందే!...”

మళ్ళీ ముగ్గురిమధ్యా కొన్ని నిమిషాలవరకూ మౌనం గడిచింది.

సరోజిని చదువుతూ చదువుతూ—తరుచూ వాడివేపు చూస్తూ కూర్చుంది. ఆమె చూసినప్పుడల్లా వాడూ చూస్తున్నాడు. ఆఖరికి వుండబట్టలేక, మళ్ళీ వాడ్ని తన దగ్గరికి పిలిచింది. మోహన్ అడుగుమీద అడుగు వేసుకుంటూ ఆమె దగ్గరికి వచ్చాడు. సరోజిని వాడి తల ఆప్యాయతగా నిమురుతూ—“నీ పేరేం బాబూ?” అని ప్రశ్నించింది.

“మోహన్ బాబు!”

“ఊఁ!....ఎక్కడుంటున్నావ్?”

“ఇక్కడే...”

“అహాఁ! అదిగాదు...మీ యిల్లెక్కడ అని అడుగుతున్నా?”

“బెజవాడలో...”

“చదువుతున్నావా?”

“ఊఁహూఁ!...”

“మరేం; మా వూరొస్తావా?”

“ఊహుఁ!—”

“పోనీ, నాదగ్గరుంటావా?”

మోహన్ కొన్ని క్షణాలపాటు ఆలోచించి, పిదప ‘వస్తా’నన్నట్టు తల వూపాడు. ఆ ఆనందంలో సరోజిని వాడిని దగ్గరకు తీసుకుని, వాడి బుగ్గను ముద్దుపెట్టుకుంది... ఆ తర్వాత వాడిని తన దగ్గరే కూర్చోపెట్టుకుని—సరోజిని కబుర్లాడుతూ కూర్చుంది. కొంతసేపటి తర్వాత, తాను తీసుకుపోతున్న వస్తూ, మిఠాయీ వగైరాలలో కొంత వాడికిచ్చింది. ఏ అభిమానంకొద్దో-కొంత అతనికిగూడా అందియ్యబోయింది సరోజిని.

అప్పుడతను ఆమెను పరిశీలించాడు.

“బాబు—చాలా మంచివాడు” అంది ఆమె—చిరునవ్వు నవ్వుతూ.

ఆ మాటను అంగీకరిస్తున్నట్టు తల వూపాడు అతను.

మోహన్ ఆపిల్ పండును తింటూ కిటికీగుండా ప్రకృతిని చూస్తున్నాడు.

“మీ రెంతవరకు పోతున్నారు?” అని అడిగాడతను.

“నిడుబ్రోలువరకూ...”

“మీ పేరు తెలుసుకోవచ్చునా?”

“సరోజిని.”

అతని ప్రశ్నల పరంపరలకు సమాధానాలుగా—తను మద్రాసులోని ఒక హాస్పిటల్‌లో నర్సుగా పనిచేస్తున్నాననీ, సెలవులమీద—స్వస్థలమైన నిడుబ్రోలు వెడుతున్నాననీ—తనకు తల్లిదండ్రులూ, అన్నదమ్ములూ వున్నారనీ—సరోజిని చెప్పింది.

అట్లాగే—అతనూ తనను పరిచయం చేసుకున్నాడు: అతని పేరు శేఖరరావు అనీ, మద్రాసులో ఒక పత్రికా ఆఫీసులో పనిచేస్తున్నట్టూ—ఏదో స్వంత పనిమీద బెజవాడ వెళుతున్నట్టూ చెప్పాడు.

“పరిచయం ఒకొక్కప్పుడు ప్రాణాలను కలుపుతుంది; ప్రాణాలను తీస్తుంది కూడా!” అన్నాడు శేఖరరావు.

# ★ స్వయంవరం ★

సరోజిని నవ్వుతూ ముఖం తిప్పుకుంది...

రైలు గూడూరులో ఆగింది. శేఖరరావు దిగి, అక్కడి 'స్టాల్సు'కు వెళ్ళి, తినడానికేవేవో పట్టుకొచ్చి, మళ్ళీ రైలెక్కాడు. ముగ్గురూ ఆప్తమిత్రుల్లా కలిసి తిన్నారు. రైలు మళ్ళీ పరుగుసాగించింది.

మోహన్ మాట అటుంచి, కమ్మగా-రాజకీయాలు, నేటి ప్రపంచపు స్థితిగతుల విషయాలు, సినిమా కబుర్లు—ఆ యువతీ యువకుల మధ్య సాగింది. సరోజిని యేదైనా చెప్పినప్పుడు—అది సబబుగాని పక్షంలో—చక్కగా విమర్శించి, ఆమెను ఒప్పించాడు.

సాయంకాలం నాలుగున్నర ప్రాంతానికి రైలు ఒంగోలులో ఆగి వున్నది. శేఖరరావు మళ్ళీ రైలుదిగి, ప్లాటుఫారంమీద నడిచాడు.

సరోజిని అతన్ని చూస్తూకూర్చుంది. మోహన్ స్టేషను హడావిడిని కిటికీగుండా చూస్తూ కూర్చున్నాడు.

కొన్ని నిమిషాలు గడిచాయి.

మొదటిగంట కొట్టింది. అతని రాకకోసం యెదురుచూస్తూ కూర్చుంది సరోజిని. అతను వస్తున్నట్టు లేదు.

రెండోగంట కొట్టింది.

రైలు మెల్లిగా బయలుదేరింది.

శేఖరరావు ప్లాటుఫారంమీద కనిపించలేదు. రైలు బయలుదేరే ఆఖరిక్షణంవరకూ అతని రాకను వేయికళ్ళతో యెదురు చూసింది. కాని......ప్రయోజనం లేకపోయింది. అతను రానేలేదు.

"అమ్మయ్యో, ఆయన రాకముందే రైలు బయలుదేరిపోతోందే!" అని దిగాలుగా అంది సరోజిని. ఆమె హృదయంలో యేదో గజిబిజి పుట్టుకొచ్చింది.

"నాన్న రాలేదేం పిన్నమ్మా?" అన్నాడు మోహన్.

మధ్య ఇదేమిటి? ఈ పిల్లాడు వరసపెట్టి పిలుస్తున్నాడూ! అయినా యేదో నోటికొచ్చినట్టు పిలవక, వాడికేం తెలుసు?...

సరోజిని మనస్సు పరిపరివిధాలుగా ఆలోచించసాగింది...లోకరీతిలో-కథల్లో చదివినట్టు—ఈ ఘటన జరిగిపోయిందేమిటి? ఈ అబ్బాయిని తనదగ్గర విడిచిపెట్టడానికే ఆయన, ఈ నాటకం ఆడాడా? ఈ తరహా మనుషులు లోకంలో ఉంటారని తనకింతకుముందే తెలుసు; కాని తానెప్పుడూ చూడలేదు. అయితే, తనిప్పుడు అనుభవిస్తున్నది! అదీ ఘటన.

ఏ అనుబంధం వల్లో ఈ అబ్బాయికీ, ఆయనకీ సఖ్యం కాబోలు! చేజిక్కిన వారికి అంటగట్టడానికి ఆయన ఇలా నాటకం ఆడి, ఆఖరికి తన కంటగట్టి పోయాడు. అయ్యో! తనెంత మోసపోయింది! 'పెళ్ళి కాకముందే నీకో బిడ్డా' అని లోకం అంటే ఏం చేయాలి! 'ఇతను నాబిడ్డకాడు; ఎవరో!' అని తను వాదిస్తే—నమ్మేదెవరు?

ఇలాటి విషయాల్లో స్త్రీతత్వాన్ని బ్రహ్మదేవుడు కూడా నమ్మడు గాబోలు!

సరోజిని తెగిపోని మమతలతో సతమతమయింది! ఆ గలభాకొద్దీ, మోహన్ని అర్థంలేని ప్రశ్నలడిగింది. ఆఖరికి—తేలిందేమిటంటే "పిన్నమ్మా! నువ్వు చాలా మంచిదానివి! నీతోనే వుంటా" అన్నాడు వాడు.

సరోజిని కలవరపాటును గుర్తించిన ప్రయాణీకులలో పెద్దాయన-ఒక మనిషి—"తప్పు చేయనివారికి—లోకంచేత భయం అక్కర్లేదు తల్లీ!—ఆ అబ్బాయిని నీతో పాటే తీసుకుపో! భయం అక్కర్లేదు!"—అన్నాడు.

సరోజిని మనస్సు స్థిమితపడుతున్న సమయంలో—రైలు నిడుబ్రోలులో ఆగింది. ఆ అబ్బాయిని తీసుకుని, శేఖరరావు వదలిపోయిన చిన్న తోలుసంచీ, తనదీ—తనతో తీసుకుని—సరోజిని బండి దిగింది.

అప్పటికి రాత్రి యేడుగంటలైంది.

ఓ గుర్రబ్బండీ మాట్లాడుకుని తన ఇంటికి బయలుదేరింది. కాని, ఆమె మనస్సులోని ఆవేదన—ఇల్లు దగ్గరపడుతున్న కొద్దీ అధికమవుతోంది.

ఇంటి దగ్గర ఆగినవెంటనే, బండి వాడికి డబ్బులిచ్చి పంపించింది. ఇంతలో ఆమె అన్నయ్య—సుందర్రావు—బయటికొచ్చి, ఆమెను పలకరించాడు.

"రామ్మా, సరోజినీ—ఇప్పుడే వస్తున్నావా?" అంటూ ఆమె ప్రక్కన నిలబడిన కుర్రాడిని చూసి నివ్వెరపోయాడు: "ఎవరీ అబ్బాయి?" అని అడిగాడు.

"ఇప్పటికి మన అబ్బాయే లే!" అంటూ లోపలికి నడిచింది సరోజిని. అంతలో తల్లిదండ్రులూ, చెల్లెలూ ఎదురయ్యారు.

అందరూ ఆ కుర్రాడెవరంటూ ప్రశ్నలు వేసేవారే! అందరికీ జవాబు లిచ్చేంతలో సరోజిని ప్రాణం తలనుండి తోక్కొచ్చినట్లయింది. ఆఖరికి గ్లాసుడు మంచినీళ్లు త్రాగి జరిగిన ఘటన అంతా తెలియజేసింది.

కాని, ఒక్క కన్నతల్లి మినహా, మిగతా వారంతా ఆమె మాటను శంకించారు; ఆమెనూ శంకించారు. ఒకరికొకరి మధ్య గుసగుసలు చెలరేగాయి. ఆమెను శంకించి నానా మాటలూ అన్నాడు తండ్రి. సరోజిని కళ్లనీళ్ల పర్యంతమయింది. తల్లి కూతురి కళ్ళనీళ్లు చూడలేక, సరోజినిని లోపలికి తీసుకువెళ్ళి అన్నం పెట్టబోయింది. సరోజినితోపాటు మోహన్ కూడా వెళ్ళాడు.

* * *

రాత్రి ఎనిమిదిన్నర గంటల ప్రాంతానికి వీధి ముంగిట బండి ఆగిన చప్పుడయింది. మోహన్ను నిద్రపుచ్చుతూ, కునుకూ పోయిన సరోజిని, ఆ చప్పుడు విని వీధికొచ్చింది. చుట్టకాలుస్తూ వీధి అరుగుమీద కూర్చున్న సరోజినితండ్రి బండి వచ్చిన విశేషమేమిటా అని ఆశ్చర్యపోయాడు.

బండి నుండి దిగిన ఇద్దరు మగవాళ్ళనీ-మసక వెలుగులో గుర్తించలేకపోయింది సరోజిని.

సరోజిని తండ్రి దగ్గరకు వచ్చిన ఓ వ్యక్తి-"ఏమండీ! సరోజిని అనే పేరుగల అమ్మాయి ......ఇక్కడే...."అని అనబోతూన్నంతలో-

"అవును... ఇక్కడే వుంటోంది ..." అని సావధానంగా జవాబిచ్చాడు సరూ తండ్రి.

"ఆ అమ్మాయి తండ్రి మీరేనా?"

"ఊఁ! నేనే!—"

"కాస్త లోపలికి రండి; కొంచెం మీతో మాట్లాడాలి..."

ఇంతవరకూ తండ్రితో మాట్లాడిన ఆగంతుకు కంఠం సరోజినికి పరిచయమైంది గాదు ......కాబట్టి ఆమె ఊరుకునే ఉంది.

ఆ ఇద్దరూ ఇంటిలోకి నడిచి, వెలుగులోకి వచ్చేసరికి-ఆ ఇద్దరిలో శేఖరరావుని గుర్తిం



## రాగిణి ఇలా చెప్పుచున్నది

"నేను ఎల్లప్పుడూ లక్స్ టాయిలెట్ సబ్బును వాడుచున్నాను—అది ఎంతో తెల్లనిది, ఎంతో శుద్ధమైనది సౌమ్యమైనది."

తిల్లానవతియగు రాగిణి ప్రవీణ నర్తకి సౌందర్యముగల సొగసైన తార. ఆమె ప్రకాశమాన చర్మ సౌందర్యము అనేక మంది వనితలకు అసూయాకరమైనట్టిది—"నేను ఎల్లప్పుడూ శుద్ధమైన తెల్లని పరిమళమగు లక్స్ టాయిలెట్ సబ్బును వాడుచున్నాను" అని ఆమె చెప్పుచున్నది

రాగిణివలె చేయుడు—శుద్ధమైన తెల్లని లక్స్ టాయిలెట్ సబ్బును ఎల్లప్పుడూ వాడుడు। శరీరమంతటి సౌందర్యము కొరకు, పొదుపైన పెద్ద సైజును కొనుడు।

### లక్స్ టాయిలెట్ సబ్బు




సినిమా తారలకు సౌందర్యమునిచ్చు సబ్బు

L. T. S- 445-X52

 స్వయంవరం 

చింది సరోజిని: ఆ సర్దింపులో నే-అప్రయత్నంగా "మీ రేనా!" అంటూ ఆమె నోరు తెరిచింది.

ఆమెను చూస్తూనే అతను మెల్లగా నవ్వాడు: "పొరబాటు జరిగిపోయింది" అన్నాడు.

అంతలో సరోజిని అన్నయ్య సుందర్రావూ, తల్లీ—రంగంలోకి దిగారు.

"ఆ అబ్బాయి తండ్రి ఈయనే నాన్నా!" అంటూ తన తండ్రికి శేశవరావుని పరిచయం చేసింది-సరోజిని.

"ఇతను నా బాల్యమిత్రుడు ... రంగారావు" అంటూ రెండో యువకుణ్ణి, అక్కడి అందరికీ పరిచయం చేశాడు శేశవరావు.

పరిచయాలు ఒక విధంగా పూర్తి అయాక—"మా అబ్బాయి యేడీ—సరోజినీ?" అని ప్రశ్నించాడు శేశవరావు.

"మీ అబ్బాయి! అలా చెప్పుకోడానికైనా మీకు అర్హత వుందేమో కొస్త ఆలోచించారా?" అని కాస్త ఆవేశంతో ప్రశ్నించింది సరోజిని.

నేరస్థుడిలాగా-శేశవరావు ముఖం పాలిపోయింది. కళ్లజోడు చేతికి తీసుకుని నెమ్మదిగా ముఖం దించుకోబోయి, శాంతంగా అన్నాడు: "ఈ ఆవేశంలో — నువ్వెన్ని మాటలన్నా నేను సహిస్తాను. ...కాని, నువ్వు నమ్మినా నమ్మకపోయినా-నిజంగా జరిగిందేమిటంటే - పొరబాటు!"

"అవునండీ! - ఆ పొరబాటు కూడా నావల్లే జరిగింది!" అన్నాడు రంగారావు.

"అసలు యేంజరిగిందో - వివరంగా చెప్పండి బాబూ?" అన్నాడు సరోజిని తండ్రి.

శేశవరావు అన్నాడు:

"పత్రికేదైనా కొనుక్కుందామని పుస్తకశాలవేపు వెళ్లాను. అక్కడ ఈ రంగారావు కనిపించాడు. అక్కడ రైలు ఎంతసేపు ఆగుతుందో నాకు సరిగా తెలీదు. అయితే, పదిహేనునిమిషాలసేపు ఆగుతుందని ఇతను చెపితే, నమ్మి, ఇద్దరమూ కేంటీనులోకి వెళ్ళాము. అతర్వాత ఇద్దరమూ ప్లాటుఫారం మీదకువచ్చిచూస్తే, రైలు వుంటేనా? నాకు తల తల్లక్రిందులైనట్లనిపించింది. తర్వాత స్టేషనుకు 'వైర్' చేసి రైల్లోని మాఅబ్బాయిని నిలపెట్టాలని అనుకున్నాను. కాని, అంతలో-అరుంపావుకు 'జనతాఎక్స్‌ప్రెస్' వున్నట్టు స్టేషన్‌మాస్టరు చెప్పాడు. ఎల్లాగూ టిక్కట్టు పుచ్చుకున్నది సరోజినకాబట్టీ, ఆమె దిగిపోతున్నది నిడుబ్రోలు అని తెలిసివుండబట్టీ—నా మనస్సును స్థిమితపరుచుకున్నాను. అనుకున్నట్లే కొనుక్కొచుని - ఇద్దరమూ ఎక్స్‌ప్రెస్‌లో దిగి - బండివాడి ద్వారా కనుక్కున్నాము. అదీ జరిగింది!" -

అందరి ముఖాల్లోనూ సంతృప్తితో కూడిన మందహాసం విరిసింది. అందువల్ల సరోజిని హృదయం కొస్త తేలికపడింది. అదే సమయంలో నిద్రమేల్కొన్న మోహన్... సరాసరి రంగంలోకివచ్చి, "నాన్నా!-" అంటూ శేశవరావు ఒళ్ళోకి జారబడ్డాడు.

సరోజిని తండ్రి సన్నాత్తవంతో అన్నాడు: "చూడునాయనా! - కల్మషం లేని హృదయంతో-సరోజిని చెప్పినమాటల్ని మేము నమ్మలేక - దాన్ని నానామాటలూ తిట్టాము. కాని, మా అమ్మాయి బంగారు పిచ్చుక - కాబట్టి ఓర్పుకోగలిగింది!"

"జరిగిందేదో జరిగిపోయింది. దాన్ని గురించి విచారించడం దేనికి; విమర్శించుకోడందేనికి! - మా చెల్లెమ్మ గుణం మాకు తెలీదూ! - ఆఁ! - బావగారూ! - ఈరాత్రికి మీ రిద్దరూ ఇక్కడే బసచేయక తప్పదు!" అని హుకుం జారీ చేశాడు సుందర్రావు.

"తప్పదు, మరి! -" అని నవ్వాడు రంగారావు. అందరూ చెదరిపోయారు.

వీధివైపు గదిలో - అతిథులు ముగ్గురికీ పడకలు సిద్ధమైయాయి...

మోహన్ మళ్ళీ నిద్రమైకంలో పడ్డాడు!

రంగారావు సిగరెట్టు ముట్టించడానికి వీధిలోకిపోయినసమయంలో - సరోజిని కాచినపాలు చెంబులో పోసుకుని, వీధిగదికి వచ్చి, శేశవరావుకు అందించింది.

"సరోజినీ! నీతో ఒక విషయం మాట్లాడాలి!" అన్నాడు శేశవరావు.

"చెప్పండి!"

"మోహన్ నన్ను ఎంతగా ప్రేమిస్తున్నాడో, అంతగా నిన్నూ ప్రేమిస్తున్నాడు! ఈ పరిస్థితులలో-నువ్వు వాడికి... వాడికి..."

"ఆపడం దేనికి? చెప్పండి!"

"నువ్వు...వాడికి...తల్లి కాగలిగితే?" అని ఆగిపోయాడు శేశవరావు.

సరోజిని కళ్ళు చిట్లించుకున్నాయి.

"అదెలా సాధ్యం?!" అని ప్రశ్నించింది.

"ఏం?"—

"వాడికి తల్లివుండగానే, నే నెలా తల్లి కాగలను?"

"అంటే వాడితల్లి బ్రతికివుందని నువ్వనుకుంటున్నావన్నమాట! లేదు, సరూ! వాడిని ఈ లోకంలో విడిచిపెట్టి, తను అప్పుడే పరలోకం చేరుకుంది!"

"వదిన!?—అంటే మోహన్..."

"...నాకుమారుడు అని నీవుపొరబడ్డావు. అది నా దోషం కాదు."

"మోహన్ మీ కొడుకు కాదన్నమాట! అయితే - మిమ్మల్ని 'నాన్నా' అని పిలుస్తాడేం?"

శేశవరావు విచారపు నవ్వు నవ్వాడు: "వాడు నన్నలా పిలవడంవల్లే, నాకీ అవస్థ! తల్లి పోయినప్పటినుంచీ వాడు నా చేతుల మీదుగానే పెరిగాడు. ఎందుకంటే, వదిన పోయినప్పటినుంచీ మా అన్నయ్య అయోమయ స్థితిలో పడిపోయి-యెప్పుడూ దేవుడి ధ్యాసలో వుండేవాడు. అప్పటినుండీ వాడిని కాపాడవలసిన భారం నామీద వేసుకున్నాను. అందువల్లే - ఇంతవరకూ నేను పెళ్లాడక వూరుకున్నాను. వాణ్ణి కన్నబిడ్డలాగా కరుణించి కాపాడగల వధువు నాకు లభించాలనే ఇన్నిరోజులూ వూరుకున్నాను. అదృష్టవశాత్తూ - నీ పరిచయం లభించి..." అని ఇంకా చెప్పబోతూన్నంతలో సరోజిని అడ్డుపడింది—తడబడుతున్న మాటలతో:

"అంటే మీరు అవివాహితులన్నమాట!- అయితే, ఈమాట ఇదివరకు చెప్పలేదేం?" అంటూ శేశవరావు ముఖంలోకి చూసింది.

"సందర్భం లభించలేదు; అంతే!" అని నవ్వాడు శేశవరావు.

"అందుకే - రైల్లో వస్తున్నప్పుడు - 'పరిచయం ఒక్కొక్కప్పుడు ప్రాణాల్ని కలుపుతుంది; ప్రాణాల్ని తీస్తుంది కూడా' అని అన్నారు కాబోలు!" అంటూ చిరుకోపం తెచ్చుకుంది సరోజిని.

శేశవరావు ఆమె చేతుల్ని తనచేతుల్లోకి తీసుకుని—"నీ మనస్సులోని మాట చెప్పు సరూ! నేనంటే నీకు యిష్టమేనా?" అని అడిగాడు.

తలూపుతూ సిగునభినయించింది సరోజిని.

అప్పుడే వీధినుండి వచ్చిన రంగారావు- "సిగ్గుపడ్డం దేనికి సరోజినీ? - నీకు భర్త కాబోయేవాడు సామాన్యుడు కాదు; పెద్ద రచయిత; కథకుడు...అందుకుగాను నువ్వు గర్వించక తప్పదు!" అన్నాడు.

ఈసారి సరోజిని—ఆ కథకుడి మీద పెళ్ళిచూపులు ప్రసరించింది.

ఆ గదికి ప్రక్కగావున్న వసారాలో—భర్త పాదాలచెంత కూర్చున్న సరోజిని తల్లి- "తథాస్తు అనండి" అంటూ తనభర్తని చిరునవ్వుతో మందలించింది. ★

# జీవిత వలయాలు



[గతవారం తరువాయి]

"ఆల్ రైట్. వెరీగుడ్. ఇవాళ బాగా చదివావు పాఠం. ఏంకావాలో కోరుకో మరి ఇస్తాను" అన్నాడు మహీధర్ అలిసిపోయి కుర్చీలో వెనక్కు వాలిన జలజవంక చూస్తూ.

★ యద్దనపూడి సులోచనారాణి ★

"ఒక్క వారంలో జులవరకూ పుస్తకం ముట్టను. సెలవు మంజూర్ చెయ్యండి" వినయంగా అంది జలజ, వచ్చిన అవకాశం జారవిడుచుకోకుండా.

"అదేలా జలజా! పరీక్షలు దగ్గరకు రాలా?" అన్నాడు మహీధర్.

"అంతేలెండి. లేకపోతే మీరు యిచ్చిన మాట నిలబెట్టుకుంటారని నేనేమీ అనుకోలేదు." జలజ మూతి వయ్యారంగా ముడుస్తూ అంది.

"అది కాదు డియర్. మరేదయినా కోరుకోమని మనవి. అంటే ఆడవాళ్లకు కావాల్సినవి, సినిమాలు, ఖద్దుకాని చీరలు, కంటికింపైన జాకెట్లు, తళతళలాడి ధగధగ మెరిసే నగ..."

"ఆగండి. ఆగండి. అవన్నీ నాకు పుష్కలంగా వుండి వెక్కసంగా వున్నాయి. నాకు లేనిదల్లా ఒక్కటే," అంది జలజ.

"ఏమిటది?" ఉత్సాహంగా ముందుకు వంగాడు మహీధర్.

"విశ్రాంతి" అంటూ జలజ టేబిల్ ముందునుంచి లేచింది.

"విశ్రాంతి లేదంటున్నావా?" తన

కూడా పక్కలోంచి లేస్తూ అన్నాడు మహీధర్.

"నిజంగా నేనండి. కేవలం మీ సంతోషంకోసం మిమ్మల్ని సంతృప్తి పరచటానికి గాను ఒక యంత్రంలాగ చదువుతున్నాను."

"ఆ మాట నాకు చాల సంతోషాన్ని కలిగిస్తోంది జలజా!" మహీధర్ కంఠంలో మధురమైన ఆప్యాయత నిండుగా తొణికిసలాడ్తోంది.

జలజ కిటికీలోంచి శూన్యంలోకి చూస్తూ చెప్తోంది.

"మీకు కాళ్ళు పట్టటంలో, మీస్నానానికి నీళ్ళు తోడటంలో యెలాటి శ్రద్ధ చూపిస్తానో మీరు చదవమన్న ఆ చదువులోనూ ఆ శ్రద్ధ చూపిస్తాను. మీరు చెప్పారు కాబట్టి చేస్తున్నాను కాని ఒక్కొక్కసారి ఆ పుస్తకాలు చూస్తుంటే తీసుకెళ్ళి పొయ్యిలో మంటపెట్టాలన్నంత కోపంవస్తుంది" అంటూ వెనక్కు తిరిగింది జలజ.

మహీధర్ జలజ పడకని సరిచేస్తున్నాడు.

"దాంతో మీకేంపని?" తీవ్రంగా అడిగింది.

"విశ్రాంతి లేనివాళ్ళకు విశ్రాంతి కల్పించటం ప్రక్కనున్న మానవుల కనీసధర్మం. ఇందులో తప్పేముంది. అసలయినా మనమిద్దరం సమాన భాగస్థులం. మనిద్దరిలో యెక్కువ తక్కువ భేదాలని నేను సహించను. రోజూ నువ్వు నా పనులన్నీ చూడటంలేదూ? ఈ ఒక్కరోజున, అందులో నువ్వలసిపోయివున్న సమయంలో యీ పని చేస్తుంటే, దానిలో తప్పులేదు సరిగదా అది నా ధర్మంకూడాను" అన్నాడు మహీధర్.

"అయ్యో మీ ధర్మాలు బంగారంకానూ! యెవరన్నా చూస్తే ఈ ధర్మాలని చూస్తారుటండి. దీనికళ్లు నెత్తికెక్కాయి; సిగ్గూ యెగ్గూ లేకుండా మొగుడిచేత పక్క వేయించుకొంటోంది, అనుకుంటారుగాని." జలజ వచ్చి మహీధర్ చేతిలో దుప్పటి లాక్కుంది.

"ఒక్కొక్కసారి నువ్వు మరీ యింత అమాయకంగా మాట్లాడతావేం? జలజా!" నవ్వుతూ అన్నాడు.

"చాలెండి. నేర్చారు మహాలావ్. మీలాటివారితో ప్రవర్తించటం కత్తిమీద సాము. ఆగ్రహంవచ్చినా పట్టలేం. అనుగ్రహంవచ్చినా పటలేం. కాసేపు చదువుకి రావడాని కాలస్యమైతే ఈ మందహాసాలు, దరహాసవదనాలు యెక్కడకు పోతాయో మరి" జలజ కోపంగా అంది.

"నువ్వు కోపంలో యింత అందంగా వుంటావని నా కిదివర కెప్పుడూ తెలియదుస్మీ," అన్నాడు మహీధర్ తన ప్రక్కపై కూర్చుంటూ ఆశ్చర్యం అభినయిస్తూ.

"ఇప్పటికైనా తెలుసుకున్నారు. ధన్యులం. జన్మ తరించింది." జలజ మామూలుగా అన్నా అందులో యేదో వ్యంగ్యార్థం వూహించాడు మహీధర్. ప్రక్కమీద పడుకుంటూ.

"నన్నుగురించి నీకేం తెలుసు జలజా. ఇది నాలో కేవలం తెచ్చిపెట్టుకున్న రూపు మాత్రమే. మరోరూపు నువ్వు చూడలేదు కాబట్టి ఆ విధంగా తలచటం సమంజసమే. ఆ రోజూ దగ్గరికి వస్తోందిలే. ఆ నాడు నువ్వు 'మీ రెంత మంచివారండి' అంటూ వచ్చి నా గుండెలమీద వాలవూ?" లోలోపల అనుకున్నాడు మహీధర్.

"కొంతమంది అర్థంలేని ఆదర్శాలకోసం జీవితధర్మాలు, వాటి విలువలు మర్చిపోతుంటారు. మహీధర్ ఆ జాతివాడేనని పిస్తోంది. కానీ, పరిస్థితి విషమించేరోజున ముందుకువచ్చి అతన్ని యెదిరించి నా జీవితమార్గం చక్కబరుచుకుంటాను. తొందరపడటం దేనికి?" అనుకుంది జలజ నిద్రకుపక్రమిస్తూ.

* * *

పరీక్షలింకా రెండుమూడురోజు లున్నాయనగా ఒకరోజు సాయంత్రం శ్రీధర్ పెట్టెలో బట్టలు సర్దప్రారంభించాడు.

"పెట్టె సర్దుతున్నా రెందుకు?" శైలజ ఆశ్చర్యంగా ప్రశ్నించింది.

"చంద్రమోహన్ పెళ్లి. వెళ్లాలి" ముక్తసరిగా జవాబిచ్చాడు శ్రీధర్.

"ఎల్లుండినుంచీ పరీక్షలు మొదలు. జ్ఞాపకంలేదా?" కోపం బలవంతంగా దిగమింగి అడిగింది.

"ఎందుకు జ్ఞాపకంలేదూ? ఉంది."

"మరి?"

"స్నేహితుడిపెళ్ళి జీవితంలో ఒకసారే వస్తుంది. పరీక్షలు అనేకసారు వస్తాయి" నిర్లక్ష్యంగా అన్నాడు శ్రీధర్ బట్టలు సర్దటం పూర్తిచేస్తూ.

"అయితే యిన్నాళ్ళనుంచి చదివిం చదువు ఒక్క స్నేహితుడి పెళ్ళికోసం నాశనంచెస్తారన్నమాట. జీవితంలో స్నేహితుడి వివాహం ఒకసారే వస్తుందని గొప్పగా చెప్తున్నారుకాని ఎంతో అమూల్యమైన కాలం పాడయిపోతుందని తెలియదన్నమాట. నా కోరికకంటే మీ స్నేహితుడి వివాహం ఎక్కువగదూ? ఇదేనామరి పెళ్ళయిన కొత్తలో మీ జీవితంకంటే నా జీవితమే ముఖ్యమని చెప్పారు" తనదగ్గరున్న అస్త్రాలన్నిటిని తీసి ప్రయోగిస్తోంది శైలజ.

"నువ్వందరి భార్యలులాగ ప్రవర్తిస్తే నేనూ అంతకంటే ఎక్కువగానే చూసేవాడిని. నా మాటలు నాకు గుర్తుచేసేముందు నీ ధర్మాన్ని నువ్వు సరిగా నిర్వర్తించావో లేదో జ్ఞాపకంచేసుకుని మరీ అడుగు. నిజమే! నా జీవితంకంటె కూడా నిన్నెక్కువగా ప్రేమించాను. ప్రేమించాను కాబట్టే అర్థంలేని నీ ఈ ఆటలు ఆడినట్లుగా సాగుతున్నాయి. ఈ నాడు నీ మాటను కాదని తోసేస్తున్నానంటే అది నువ్వుచేసుకున్నదే, నువ్వు కావాలని నీ విలువను పోగొట్టుకున్నావు. దానికి నన్నేం చెయ్యమంటావ్?" పెట్టెకి తాళంవేస్తూ అన్నాడు. అతనిమాట లెంత ప్రశాంతంగా వున్నా వాటిలో తీవ్రమైన కఠోరత కన్పిస్తోంది.

"అయితే వెళ్ళటానికే నిశ్చయించుకున్నారన్నమాట" ఆఖరుమాటగా అడిగింది శైలజ.

"నిర్ణయించుకోకపోతే ప్రయాణం ఎలా అవుతాను?" వ్యంగ్యంగా అన్నాడు శ్రీధర్.

"మీరు వెళ్ళగలిగేది నన్ను మీ చేతులలో శవంగా మార్చిన తర్వాతనే, గొంతులో ప్రాణంవుండగా మిమ్మలను పోనీయను." శైలజ మూర్తీభవించిన చండీదేవతలా అంది.

శ్రీధర్ భార్యమొహంలోకి క్షణం చూచి "అంటే నిన్ను చంపి వెళ్ళమనా నీ అభిప్రాయం? ఎందుకూ? నీ కంత యిష్టంలేకపోతే మీ అన్నయ్య దగ్గరకు వెళ్ళిపో. మీ వదినకూడా పరీక్షలకి చదువుతోంది కాబోలుగా. పాపం కాస్త సాయమైనా చేద్దువుగాని." శ్రీధర్ అంత హేళనగా మాట్లాడగలడని శైలజ యెన్నడూ తలచలేదు.

"మీ యిష్టం వచ్చినట్లు మాట్లాడండి. దానికి నే నేమీ అనను. ఆ పరీక్షలు వ్రాసి మీ యిష్టంవచ్చినచోటుకు వెళ్ళండి. నేనడ్డుపెట్టను." బలవంతంగా యేడుపు ఆపుకుని అంది.

"అవును లేమరి పరీక్షలయిన తర్వాత యింకెందుకు మరి? పందెంలో పావుల పని అయిపోతుందిగా! పరీక్షకు వెళ్ళటమంటూ వుంటే తప్పకుండా పాసవుతానని నీకు

తిరువణ్ణామలై పుణ్యక్షేత్రంలో కొండమీదినుంచి చూస్తే కనిపించే శ్రీ అరుణాచలేశ్వరదేవాలయదృశ్యం. ఇటీవల కార్తికదీపోత్సవానికి ఈ కొండశిఖరంమీదే దీపాలు వెలిగించారు. ఈ ఉత్సవానికి ఏటా వేలాది యాత్రికులు వస్తారు.

# ★ జీవిత వలయాలు ★

తెలుసు. గెలుపుచూపించుకుని అన్యాయాన్ని ఎక్కిరించవచ్చు. అందుకు నేనొక సాధనమన్నమాట. బజారులో కొన్న యంత్రం మీదవుంటే దృష్టితప్ప నువ్వు యేనాడయినా నన్ను భర్తగా చూశావా? ఛీ! భర్తని పందెంలో పావుగా ఉపయోగించుకునే స్త్రీలు ఇంతవరకూ జన్మించలేదు. నేటి కాలానికి నువ్వుపుట్టావు. నీ పైపై మెరుగులు చూచి మోసపోయినందుకు మంచి శాస్తి చేశావు. సరే! పరీక్షలయిం తర్వాత మనిద్దరికీ రాం రాం!" పెట్టెతాళంచెవి భార్య మీదకు విసిరి కొట్టి ఇలా అన్నాడు. "సరే. ప్రయాణం ఆపేస్తున్నాను. కాని ఒకటి గుర్తుంచుకో. పరీక్షలయిన మరుక్షణంనుంచి నీకూ నాకు యేలాటి సంబంధమూ లేదు. డిగ్రీకాగితం తీసుకుని నా జీవితంలోంచి మారుమాట్లాడకుండా నిష్క్రమించు. నీకు వెయ్యి నమస్కారాలు. నీగెలుపు ఓటములతో నాకు సంబంధంలేదు. నన్నింతటితో వదిలిపెట్టు." అప్పటి పరిస్థితులలో శైలజ మొహంచూస్తే శ్రీధర్ అన్నిమాటలు అనటానికి సాహసించి వుండేవాడుగాదు. శైలజ మొహంచూడకుండానే గదిలోంచి బయటకు వచ్చేసి క్రిందికి దిగివెళ్ళిపోయాడు. చాలా సీపటికే వాడిపోయి రక్తంలేని మొహంతో క్రిందకు వచ్చిన కోడల్ని అత్తగారు అర్థంగానట్లు చూసింది.

* * *

క్రమంగా పరీక్షలయిపోతున్నాయి. శ్రీధర్ పరీక్షలకు వెడుతున్నాడు వస్తున్నాడు. కాని ఒక్కరోజున గూడా యీ విధంగా వ్రాశానని శైలజతో చెప్పలేదు. ఆఖరిరోజున పట్టలేక తనే అడిగింది.

"తేలికగా వున్నాయా? మీరు అనుకున్న ప్రశ్నలే వచ్చాయా?"

"ఆ! కాను వస్తుందిలే. లేకపోతే నీకు తృప్తి వుండదుగా. పందెంలో పావుగా నా ధర్మాన్ని బాగానే నెరవేర్చుకుంటాను. నా జీవితంలోంచి నువ్వు నిష్క్రమించేటప్పుడు నీ మొహంలో నాకు అసంతృప్తి కన్పించకూడదు." శైలజ మరోమాట మాట్లాడలేక పోయింది. చెదురుతూ తన వంక చూస్తున్న భార్యని గమనించనట్లుగా శ్రీధర్ వెళ్ళిపోయాడు. అలవాటు చొప్పున "యెక్కడికి వెళ్తున్నారని" ఆ ప్రశ్న నోటిదాకా వచ్చినా అతనిమొహం చూసేగానే అక్కడే బిగుసుకు పోయింది. ఆ రాత్రి జీవితంలో మొట్టమొదటిసారిగా తన పరిస్థితికి హృదయ విదారకంగా యేడ్చింది శైలజ.

పరీక్షలయిన వారంరోజులకి మహేశ్వర్ దగ్గరనుంచి వుత్తరం వచ్చింది. అందులో శైలజ పరీక్షలు బాగానే వ్రాసింది అని వ్రాస్తూ తన చెల్లెల్ని తీసుకుని వస్తే వేసవికాలం రెండునెలలూ తనవూళ్ళో సరదాగా గడుపవచ్చుని మరీమరీ యిద్దర్నీ రమ్మని కోరుతూ వ్రాశాడు. శ్రీధర్ వుత్తరం భార్యచేతికిస్తూ "అయితే పెట్టె సర్దుకో" అన్నాడు.

"సర్దుకో అంటున్నారు, మరి మీరు రారా?" అంది శైలజ. ఆమెలో మునపటి ఠీవి, అహంకారం లేవు. ఏమాటంటే యేం విపరీతార్థం తీస్తాడోనని చాలాతూచి మాట్లాడుతున్నది.

"నీకు ముందే చెప్పాను. పరీక్షలయిన తర్వాత మనిద్దరికీ యేవిధమైన సంబంధమూ వుండకూడదని." అతని మాటల్లో చలనంలేని కఠినత్వం చూసి శైలజ యేమాత్రం చెదరకుండా,

"సరే చూస్తాను. బ్రహ్మరుద్రులు వచ్చినా నన్ను మీ దగ్గర్నుంచి తీసుకెళ్ళలేరు. నా పట్టుదల సంగతి మీకు కొత్తగాదు, బాగానే తెలుసు." శైలజ క్రిందికిదిగి వచ్చేసింది.

ఆ రాత్రి భోజనం చేస్తుండగా కొడుకుని తల్లి మందలించింది. "ఎందుకురా దానిమీద చిర్రుబుర్రూలాడుతావు. అదేం చేసింది? నిజంగా అది పట్టుదల పట్టబట్టే గాని లేక

పోతే నువ్వంత యిదిగా చదివేవాడివా? దాని పట్టుదలకు మెచ్చుకునేది పోయి కస్సుబుస్సు అంటావే?" శ్రీధర్ కి సమాధాన మేం చెప్పాలో తోచలేదు.

*       *       *

నాలుగురోజుల అనంతరం మహీధర్ వుత్తరం పత్తరం లేకుండా జలజతో సహా బండీదిగాడు. వీళ్ళురాక యెందుకో అర్థం గాక యేవో రెండుమూడు కుశల ప్రశ్నలు వేసి మెల్లగా బయటకు జారుకున్నాడు. శ్రీధర్. ఎవరో స్నేహితుని కలుసుకోవాలంటూ మహీధర్ గూడా ఫోంచేసి వెళ్ళిపోయాడు.

వదినా మరదళ్ళిద్దరూ వచ్చి గదిలో కూర్చున్నారు. పరీక్షల పేరుచెప్పి భర్త తన్నేవిధంగా తిప్పలుపెట్టింది జలజ తన కథంతా వెళ్లబోసుకుంది. అంతా చెప్పి చివరకు "వీళ్ళకి హృదయాలుండవు శైలా. అర్థంగాని అదర్శాలకోసం అందమైన జీవితాలని ఆనందమయంగా చేసుకోవాల్సింది పోయి ముళ్ళకంపలు చేసుకుంటారు. లేకపోతే నాకిప్పుడు చదువేమిటి నా మొహం, చెప్పు. ఆ పాడుడిగ్రీ లేకపోతే వచ్చిన లోటేమిటి? దానికోసం యెంత అమూల్యమైనకాలం పాడుచెయ్యాల్సి వచ్చిందో చూడు. శూన్యంలోకి కళ్ళు తెరుచుకుని రెప్పవాల్చకుండా చూస్తున్న శైలజ తన గోడు వింటంలేదని పాపం జలజకు తెలియదు.

హృదయం విప్పి మాట్లాడుతున్న జలజతో శైలజ తనకథ చెప్పకుండా వుండలేకపోయింది. అంతా చెప్పి చివరికి. "అసలు నేనంటే నే విరక్తి చెందారేమోనని యిప్పుడు భయమేస్తోందిజలజా. నిజంగా ఆయనన్నట్లునావిలువను నేనే నాచేతుల్తో నే పాడుచేసుకున్నానేమో అనిపిస్తోంది. మునుపు ఆయనదగ్గరుండే చనువు నాకిప్పుడు లేదు. దీని పర్యవసానం యేమవుతుందో తెలియకుండావుంది. పైకి యింత బింకంగా కన్పిస్తున్నాను గాని యేక్షణాన యేం జరుగుతుందోననే భయం." కళ్ళ నీళ్లు తుడుచుకుంటూ అంది శైలజ. అంతా విన్న జలజ కోపంగా...

"అయితే అన్నా చెల్లెళ్ళిద్దరూ ఒకటే పైపన్నమాట. మేమేం చేస్తామమ్మా మీకు. మమ్మల్నిలా వేధించి చంపారు. మీ అన్నయ్య జీవితం గూడా తెగిపోవాల్సిందే. నా సహనంవల్ల వుందిగాని." తనఒళ్ళో వాలి పసిపిల్లలాగ విలపిస్తున్న శైలజను చూసేసరికి జలజకి కోపంపోయి స్త్రీసహజమైన దయ వుప్పొంగింది.

"ఇప్పుడు బాధపడే యేం ప్రయోజనం శైలా! జరిగిన దానికి క్షమించమని అతన్ని అడగటమే మంచిదనిపిస్తోంది నాకు."



తిరువణ్ణామలైలో 'శివగంగ' కోనేరు సమీపమునగల అరుణాచలేశ్వర దేవాలయం. వెనకాల కనబడే కొండమీదనే కార్తీకదీపోత్సవం జరిగింది.

—ఫోటోలు: ఎన్. రామకృష్ణ.]

"ఆపరిస్థితి గూడా దాటిపోయింది జలజా" శైలజ మరింత యేడుస్తూ అంది. శైలజతల నిమురుతూ జలజ చాలసేపు అలాగే కూర్చుండిపోయింది. కాసేపటికి యేదో తోచినట్లుగా శైలజమీదకువంగి,

"శైలా! ఇటు చూడు. ఇది మంచి ప్లానుగా నాకు తోస్తోంది. ఇది ఒక్కటే బాగా నాకు నచ్చింది. ప్రయత్నించి చూడు." అంది.

"ఏమి టది?" రొట్టుబడి వాచిపోయిన కళ్ళనెత్తుతూ అడిగింది.

జలజ వంగి శైలజచెవులో ఏదో రహస్యం చెప్పింది.

శైలజ మొహం విప్పారినా అందులో అది ఫలిస్తుందా అన్న అనుమానం తొంగిచూడక పోలేదు.

"సరే! ప్రయత్నించి చూస్తాను" అంది.

మర్నాడు ఫోంచేసి అందరూ క్రింది హోలులో కూర్చుని ఉండగా గోపీ పరుగెత్తుకు వచ్చాడు. వస్తూనే మహీధర్ దగ్గరకు వెళ్లాడు. శ్రీధర్, శైలజ ఆశ్చర్యంగా చూస్తున్నారు.

"అక్కా, బావా వస్తున్నారు," అన్నాడు.

"ఇతను నీ కెలా తెలుసు?" శ్రీధర్ ఆశ్చర్యంగా అడిగాడు.

"వాళ్ళ బావ నా డియరెస్ట్ ఫ్రండ్. మొన్న నాతోనే యీ వూరు వచ్చాడు. నేను అక్కడకు వెళ్ళటంతో బాగా చనువయ్యాడు." అన్నాడు మహీధర్.

"అన్నయ్య శ్రీధర్రావుగారి డియరెస్ట్ ఫ్రండ్ అన్నాడు" అన్నాడు వస్తూ.

మహీధర్ "ఊ! అలాగా. ఏం శ్రీధర్ రాజారావు నీ ఫ్రండేనా" అన్నాడు. శ్రీధర్ నవ్వాడు.

ఇంతలో పల్చగా పొడుగ్గా వున్న ఒక అమ్మాయి, రాజారావు, మోహన్ వచ్చారు. ఎవరి స్నేహితుల్ని వారు చిరునవ్వులతో పల్కరించుకున్నారు. రాజారావు నవ్వుతూ "ఈమె మా చెల్లెలు పద్మ. భర్త మోహన్.

"ఇంక మా శ్రీమతి ఒక్కతే తక్కువైంది అన్నాడు" అందరూ నవ్వారు.

"మీ రిజల్ట్స్ యెప్పుడు తెలుస్తాయి శ్రీధర్" అని అడిగాడు మోహన్. పద్మ గూడ శైలజ, జలజలతో చాల చనువుగా మాట్లాడింది. అంతవరకూ నవ్వుతూన్న శ్రీధర్ మొహంలో రంగులు మారాయి. అది ఒక్క శైలజ దృష్టికి తప్ప యెవ్వరికీ అంతలేదు.

"కాను వస్తుందా?" మహీధర్ రాజారావు నడిగాడు.

"యెవరికీ అన్నయ్యకా? అన్నయ్యకేమోగాని శ్రీధర్రావుగారికి ష్యూర్. ఫంకామీద కొట్టి చెప్తాను." అంది పద్మ.

శైలజ అర్థంగానట్లు చూసింది.

పద్మనవ్వుతూ "మాయింటిదగ్గర వీళ్లిద్దరూ చదివేవారు. శ్రీధర్రావుగారు రాత్రి రెండు గంటలవరకూ చదువుకుంటుంటే మా అన్నయ్య పది కాకముందే నిద్రపోయే

 

# జీవితవలయాలు



వాడు. అబ్బ! అప్పుడు శ్రీధర్రావుగారు మా అన్నయ్యని మేల్కొలుపుతుంటే వినాలిరా బాబూ! ప్రక్కగదిలో పడుకున్న నాకు యెంతాపుకున్నా నవ్వు ఆగేదికాదు. చివరికాయనమీద విసుక్కుంటూ, గొణుక్కుంటూ లేచి పుస్తకాలముందు కూర్చునేవాడు. నిజంగా మా అన్నయ్య యీ సారి పాసయితే అది కేవలం శ్రీధర్రావుగారి ప్రతిభ అనే చెప్పాలి" అంది. అందరూ పద్మతో పాటు నవ్వారుగాని శైలజనవ్వలేకపోయింది. మొదట శ్రీధర్ కూడా అందరితో పాటు నవ్వాడు గాని మధ్యలో భార్య ముఖం చూసేసరికి అతనికేదో జ్ఞాపకంవచ్చి ముఖం గంభీరంగా చేసుకున్నాడు. చాలా సేపు కూర్చున్న తరువాత పద్మ లేస్తూ "రేపు నా బర్త్ డే పార్టీ. తప్పకుండా అందరూ రావాలి." అని మరీ మరీ చెప్పి ఒట్టు వేయించుకుని వెళ్ళిపోయింది.

సినిమాలకీ, షికార్లకీ యిష్టంలేకపోయినా బలవంతాన తిరుగుతున్నట్లు కన్పించాడు శ్రీధర్. మర్నాడు పద్మపుట్టినరోజు. పార్టీకి అందరూ బయల్దేరారు. విశేషంగా అలంకరించుకొని సహజ సౌందర్యానికి మెరుగులు దిద్దుకుని మెరిసిపోతున్న శైలజ మీదనుంచి శ్రీధర్ బలవంతాన తన దృష్టి తొలగించుకోవాల్సి వచ్చింది. తన భార్యలో అంత సౌందర్యనిధులున్నాయని ఇప్పటివరకూ శ్రీధర్కి తెలియదు. పార్టీ చాలా ఘనంగా జరిగింది. చాలమంది వచ్చారు. అందరూ శైలజను చూసి, అతని పరీక్షనుగురించి విని "నువ్వు చాలా అదృష్టవంతుడివి శ్రీధర్" అన్నారు.

"ఏం అదృష్టంలే బాబూ! నా అదృష్టం యే నిర్భాగ్యులకు వద్దు" అనుకున్నాడు మనసులో శ్రీధర్. కాని ఆసమయంలో అతని చూపులు మటుకు శైలజను వెతుకుతూనే వున్నాయి.

నాల్గు రోజులుండి తిరిగి వెళ్ళటానికి బయలుదేరుతున్న మహీధర్తో "మీ చెల్లెల్ని కూడా తీసుకువెళ్లు నీతో" అన్నాడు. శ్రీధర్.

"ఆ యెందుకు? మేం వచ్చాంగదా మరోసారి వస్తుంది. ఇప్పుడొద్దులే. పరీక్షలు తెలిసిన తర్వాత యిద్దరూ వద్దురుగాని" అన్నాడు మహీధర్ మరో మాట కవకాశం యివ్వకుండా. శ్రీధర్కి యేం మాట్లాడాలో తోచలేదు. కాసేపటికి 'నాకు తీరుబడి వుండదు' అన్నాడు.

"పోనీ అంతగా చూడాలని వుంటే మేమే వస్తాం" మహీధర్ సంభాషణ తుంచేసి అక్కడనుంచి వెళ్ళిపోయాడు. మొట్టమొదట చెల్లెల్ని బావమరిదిని తనతో పాటు తీసుకెళ్లాలని వచ్చిన మహీధర్ తన అభిప్రాయాన్ని మార్చుకోవటానికి కారణభూతు లెవరో తెలుసుకోవటానికి శ్రీధర్కెంతోసేపు పట్టలేదు.

"ఇంతకీ పందెంలో ఎవరు గెల్చారు? నువ్వా మీ అన్నయ్యా" అని అడిగాడు శ్రీధర్ భార్యను జలజావాళ్లు వెళ్ళిపోయిన సాయంత్రం.

"నేనే" అంది శైలజ.

"యెలాగ జలజకూడా బాగా చదివింది కదా. తప్పకుండా పాసవుతుందని చెప్తున్నావే మరి"

"అయితే సమానమవుతాం" అంది శైలజ వచ్చేనవ్వు ఆపుకుంటూ శ్రీధర్ అర్థంగానట్లు మొహంలోకి చూశాడు.

"పందెంలేదూ పాడులేదు. మా రాజేశ్వరి పెళ్లిలో మిమ్మల్ని చూశాను. మీ అందం మీ తీవి చూస్తే మిమ్మల్ని పెళ్ళిచేసుకోవాలనిపించింది. అమ్మా, నాన్న అందరూ చదువు తక్కువని సందేహించారు. అయినా పట్టుదలపట్టి మిమ్మల్నే చేసుకున్నాను. కాని తర్వాత మాచుట్టాలు, స్నేహితులు నన్ను యెగతాళి చెయ్యటం మొదలుపెట్టారు. వారి యెగతాళే మిమ్మల్ని యింతగా చదివించటానికి కారణమయ్యింది. నేను ఒకసారి యీ విషయమే అన్నయ్యకు వ్రాస్తే మంచిదని సలహాయిస్తూ తనుగూడా జలజచేత పరీక్షకి కట్టించాడు. కాని అన్నయ్య జీవితంలో యేమార్పూ రాలేదు. జలజ వాడిని అర్థం చేసుకుని సహకరించింది. కాని మీరు..." శైలజ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. తల వంచుకుంది.

శ్రీధర్ మొదట తెల్లబోయినా తర్వాత సంబాళించుకుని "మరి యీ విషయం చెప్పకుండా ఆవిధంగా అబద్ధం ఎందుకు కల్పించావు శైలా!" చాల రోజుల తర్వాత అతని కంఠంలో ఆప్యాయత కన్పించింది.

"కేవలం వారి కోసమంటే మీరు పట్టుదలగా చదవరనుకున్నాను. అందుకని ఆ విధంగా చెప్పాను. నన్ను ఈఒక్క విషయంలో క్షమించండి" శైలజ వంగి అతని పాదాలు తాకుతూ అంది. శ్రీధర్ దూరంగా జరిగి "ఆగు ఇవాళ క్షమించమని యింత తేలికగా అడుగుతున్నావు. కాని యిన్ని రోజుల్నుంచి నేనెంత క్షోభించిపోయానో నీకు తెలియదు శైలా' శైలజ మరింత దగ్గరకు వస్తూ

"అవును నాకు తెలుసు" అంది కళ్ళనీళ్ళలో తన వైపుచూచే శైలజను చూసేసరికి శ్రీధర్ హృదయం కరిగిపోయింది.

"జీవితంలో మరో మారు ఓడిస్తున్నావు కదూ!"

"లేదండి లేదు. మరోసారి ఓడిపోతున్నాను. చిన్న పిల్ల ఆడే చిలిపి ఆటలను చూస్తున్నట్లుగా మీరు ప్రతిదీ నన్ను క్షమిస్తున్నారు. ఇంక ఈవిధమైన జీవితాన్ని మరి రానివ్వను. నాకు అవకాశం ఇవ్వండి. నాజీవితాన్ని విషాదాంతం చెయ్యబోకండి" శైలజ శ్రీధరుని భుజంమీద వాలి యేడుస్తూ అంది.

"నీజీవితం విషాదాంతం చేస్తానని నువ్వెలా అనుకోగలిగావు శైలా? కఠినమైన నిబంధనలతో నిన్ను నువ్వు బంధించుకున్నావు. నన్ను బంధించావు. అందువలన నేనా అసలు స్వరూపం గుర్తించలేకపోయావు. ఈరోజునుంచి నూతన జీవితం ప్రారంభిద్దాం పద. అమ్మ భోజనానికి మనకోసం యెదురు చూస్తూ వుంటుంది." అన్నాడు శైలజ మొహం తన వైపుకి తిప్పుకుని కళ్ళ నీళ్ళు తుడుస్తూ. అప్పుడే భోజనానికి రమ్మనమని పిలుద్దామని లోపలకు రాబోయిన తల్లి ఆగి వెనక్కు వెళ్ళిపోయింది. ప్రక్కయింటి వారి కొబ్బరి చెట్టు మీద వున్న రెండు పక్షులు యింక మనం చూడకూడదన్నట్లు లేచి యెగిరిపోయినాయి. ఈ రెండు సంగతులు వారికి తెలియవు. ఆవిధంగా వారెంతసేపు వున్నారో కూడా వారికే తెలియదు.

(అయిపోయింది

# ఆవకాయా-అమ్మాయా

జనతా పొగలు కక్కుకుంటూ వచ్చి స్టేషన్లో ఆగింది. కాలి నుసైపోయిన బొగ్గు విసర్జించి, కొత్త బొగ్గు వేసుకుంది. చాలా దూరంనుంచి వస్తున్న పాత ప్రయాణీకుల్ని కొందర్ని దింపేసి, కొత్తవాళ్లను ఎక్కించుకుంది.

"దవనాప్-చామంతిపూల్"

రైల్వేస్టేషన్ యాసలో అరుస్తున్నాడొక పూలమ్మే కుర్రాడు. ఇంకా టీ, కాఫీ, ద్రాక్ష, సోడా, పిప్పరమెంట్లు, సిగరెట్లు, పేపర్లు—ఇంకా సకలవస్తువులవాళ్ళూ రైలు పొడుగున అటూ యిటూ తిరుగుతున్నాయ్. విజయవాడ స్టేషను మహా కోలాహలంగావుంది.

కాంతారావు రొప్పుకుంటూ పరుగెత్తుకొచ్చి సెకండ్ క్లాసులో కూచున్నాడు. వెనక కూలీ తెచ్చిన పెట్టే, బెడ్డింగూ, జాడీ అన్నీ సాయంపట్టి బెంచీకింద సర్దేయించాడు. బెంచీకింద అంతా అశుభ్రంగా వుంటుందని తిరిగి జాడీని పైబెర్తుమీద పెట్టించాడు. కూలీ డబ్బులు పుచ్చుకుని వెళ్లిపోయాడు.

వాచీ చూసుకున్నాడు కాంతారావు. మూడూనలభయి. ఇంకా ఐదు నిముషాలు టైముంది. తను గాభరాపడి తొందరగా పరుగెత్తాడు. మరేంచేస్తాడు? మామయ్య టైమైపోతోందని ఒక పేగోల. అత్తయ్యేమో ఎంతకూ తెమలనీదు. ఆ జాడీ పార్శిలు చేస్తూ కూచున్నది-కొత్తావకాయిజాడీ!

నాయనమ్మ ఆవకాయంటే పడిఛస్తుంది. అందులోనూ రాజమ్మత్తయ్యపెట్టిన కొత్తావకాయంటే చెవులు కోసుకు మరీ ఛస్తుంది. మొన్న కృష్ణాపుష్కరాలకు వొచ్చినప్పుడు పెట్టి పంపమని చెప్పి వెళ్ళిందట. ఈవిడ కొసరి కొసరి పెట్టిపంపిస్తోంది: మధ్యను ఈ జాడీని రిక్షాలోంచి దింపలేకా, రైల్లో ఎక్కించలేకా తన తాడు తెగిపోతోంది.

ఒక్కసారి పైబెర్తుమీద కైతాయించిన జాడీకేసి చూశాడు. ఆనందకరంగా ఆవకాయి పరిమళం ఘుమాయిస్తోంది. అంచుల్నించీ కారిన నూనెతో కట్టుకట్టిన గుడ్డ అంతా మరకలైవుంది. ఆ పరిమళం మరింత ఘాటుగాపెట్టెఅంతా ప్రసరించింది. పెట్టెలో అతడు తప్ప మరెవ్వరూ లేరు.

కాంతారావు చేతిలోని సినిమాపత్రిక తిరిగేయటం ప్రారంభించాడు.

ఇంతలో గబగబా పెట్టెలోకి వచ్చింది ఓ అమ్మాయి. వచ్చి, కాంతారావు పక్కనే తన పెట్టెవుంచి ఎదురుగా కూచుంది.

పత్రికలోంచి తలెత్తిన కాంతారావు ఆశ్చర్యపోయాడు. ఆ అమ్మాయి ఎవ్వరో కాదు. తన క్లాసుమేటు పద్మజ! కాలేజీకి వొచ్చేటప్పుడూ, పొయ్యేటప్పుడూ పదిహేనుమంది సఖులతో పరివేష్టించి నడుస్తూ 'మిస్ కాలేజి' అని పేరందిన పద్మజ!

గార్డు విజిలు వేశాడు. రైలు కదిలింది.

అతడు ఒక్కసారి తన అమెరికన్ జాకెట్టువంకా, సైకిలర్ ప్యాంటువంకా చూసుకున్నాడు. "ఫ్లీ మోతగా వున్నాయి!" అనుకున్నాడు. ఆమెకేసి చూశాడు. వాచీకి కీ యిస్తోంది.

పణాతుల రామచంద్రయ్య

ఆవిడను పలకరించడమా? మానటమా? అనుకున్నాడు. పలకరిస్తే ఏమనుకుంటుందో ఒకవేళ, పలకరించకపోతే—"ఈ కుర్రాడికేం మేనర్సు తెలీవే!" అనుకోదూ. ఎంత ఇన్సల్టు; ఫైనలియరు చదువుతున్న తను మేనర్సు తెలీవనిపించుకోవటం!

కాంతారావిలా ఆలోచనల్లో కొట్టుమిట్టాడుతుంటే ఆ అమ్మాయే అడిగింది ఇంగ్లీషులో—

"ఎక్కడికండీ?" అని.

"ఎచ్చే, తెనాలికండీ!" తెలుగులో జవాబిచ్చాడు.

యూనివర్సిటీకోర్సంతా తెలుగులోనే సాగాలని కాలేజి డిబేటులో ఏకధాటిగా ఉపన్యసించాడొకసారి కాంతారావు. అది పద్మజకూ తెలుసు. అందువల్ల మెల్లగా ముసిముసిగా నవ్వుకుంది.

"ఏదీ, ఆ పత్రికొకసారి యిలా యిస్తారా?" అని, కాంతారావు ఇవ్వటంకోసం ఎదురు చూడకుండానే అతడి చేతుల్లోవున్న పత్రిక తీసుకుంది. ఆ సమయములో ఆమె చేతుల్లోని విద్యుచ్ఛక్తి ఆ పత్రికద్వారా ఒక్కక్షణంపాటు కాంతారావులో ప్రవహించింది. అతడు ఆ పత్రికను మనసులోనే స్తుతించాడు. దాని పెట్టిన అర్ధరూపాయిలో ప్రతి నయాపైసా సద్వినియోగమయింది!

కాని మరుక్షణంలోనే ఆ పత్రికమీద అతడికి ఎక్కడలేని కోపం వచ్చేసింది. ఈ పత్రిక లేకుండావుంటే, ఆమె తనతో ఆ మాటా ఈమాటా మాట్లాడుతూ, నవ్వుతూ వుండునుకదా! ఈ నడమంత్రపు పత్రిక దానికి అడ్డు వచ్చింది. అందులోనూ సినిమా పత్రిక. దాంట్లో ఆమూలనుంచి ఈమూల దాకా చదివేవరకూ ఆవిడ తలెత్తే అవకాశంలేదు. అంతవరకూ తాను దిగులుగా కూచోక తప్పదుకదా. దుర్విధి!

కాంతారావు హృదయం చీకటయింది. "సరే ఏం చేద్దాంలే, గతంగతః" అనుకున్నాడు. ఈలోపల తన క్రాఫూ, కాలరూ కాస్త సరిచేసుకుందామని ఆ పని పూర్తి చేసుకున్నాడు. గుండె జారుమంది.

లక్షణంగా కూచుని కాలరు సర్దుకుంటున్న మనిషికి గుండె జారుమన్నదెందుకూ అంటే, ఆ సమయంలో అతడికి పైబెర్తుమీద పరిమళాలు చల్లుతున్న తన ఆవకాయి జాడీ జ్ఞప్తికొచ్చింది. భయమూ, అవమానమూ కలిగాయి.

పత్రికమీది కోపం కాస్తా జాడీలోని ఆవకాయిమీది కోపంగా మారింది. దీని ముఖంమండా! దీనికెంత పొగరు! రాజమ్మత్తయ్య హస్తవాసివల్ల సంక్రమించిన రుచీ, పరిమళమూ తనలో వుంటే వుండవచ్చుగాక! అంతమాత్రంచేత ఇలా ఘుమాయించి పోతుందా. ఒకవేళ ఘుమాయించినా— తను 'మిస్ కాలేజి' పద్మజవంటి కల్చర్డ్ లేడీతో మాట్లాడుతున్నప్పుడా? దీన్ని— మింగెయ్యా!

కాని ఆవకాయి పరిమళం తీవ్రతరమవుతోంది. "ఏది కోపం వస్తేంచేస్తుంది పోదూ" అనుకున్నట్టుంది అది!

కాంతారావు వుడికిపోతున్నాడు. కాలిపోతున్నాడు. ఆ వాసన, తలొంచుకుని పత్రిక చదువుకుంటున్న పద్మజకు సోకితే? ...ఇంకేమన్నా వుందా!...ఆమె తలెత్తి ఏమిటని అడిగితే?...ఏం చెప్పాలి?...పైకి చూసి, ఆ జాడీ ఎవరిదని అడిగితే? ... తన

# ★ ఆవకాయా - అమ్మాయా ★

దని చెప్పగలడా? అంతకంటే ఆత్మహత్య ఎన్నుకోదగ్గది.

అతడి అవస్థ చెప్పతరంకాదు. పద్మజ పత్రిక చదవటం పూర్తయింది. ఆవిడ దృష్టిని ఆవకాయ వాసననుంచి దూరంచెయ్యాలని, అతడే సంభాషణ కొనసాగించాడు.

"మరి మీరేవూళ్లో దిగుతారన్నారు?"

"కావలి."

తర్వాత ఏమడగాలో తోచలేదు. నీళ్లు నములుతూ కూచున్నాడు.

రెండుమూడు స్టేషన్లు దాటిపోయాయి. తెనాలి సమీపించబోతున్నది. కాంతారావు గుండె దడగా కొట్టుకుంటున్నది. ఏక్షణాన ఆవిడనోటినుంచి "ఆఆకావకాయిజాడీ..?" అన్న ప్రశ్న శూలమై వస్తుందో......!

ఆ భయంలోనే సంభాషణ సాగించాడు.

"మరి కావలిలో మీ రిలెటివ్స్ ఎవ రేనా......?" అన్నాడు.

"అబ్బే. రిలెటివ్స్ ఎవరూ లేరండీ. అక్కడ మా స్నేహితురాలు అరుణ వుంది. ఇంటర్ పూర్తికాగానే ఆ అమ్మాయికి పెళ్ళయింది లెండి. "ఈ దసరా సెలవుల్లోనైనా వచ్చిపోకుంటే మీకూ మాకూ ఇంతటితో సరి"—అంటూ వాళ్లు భార్యాభర్తలిద్దరూ చాలా నిష్ఠూరంగా జాబులు రాశారు. అందువల్ల ఓమారు వెళ్ళి చూసొద్దామని వెడుతున్నానండీ."

'శుభం' అనుకున్నాడు కాంతారావు. ఆ స్నేహితురాలేవత్తో కావలిలోనే వుండకపోతే వుండేదిను పో, ఈ మెను రమ్మని వ్రాయనేల! వ్రాసెను పో, యీవిడ బయలేర నేల? బయలేరెను పో, ఈ బండిలోనే ఎక్కనేల? ఎక్కెను పో—

కాంతారావు స్వగతం 'తెక్కన కట్' అయింది, పద్మజ ప్రశ్నతో.

"అబ్బ! ఎక్కడిదండీ ఆవకాయ వాసనా?" పడింది పిడుగు!

ఆ ప్రశ్న సరిగా వినబడనివాడికిమల్లే, "ఏమిటండీ?" అన్నాడు.

ఆ అమ్మాయైనా, కాంతారావుకు వినబడ లేదేమోలే పాపం - అని మరోకసారి చెప్పి చూడవచ్చునా? ఊహు, ఏదో అవసర మున్నట్టు తల పైకెత్తి చూచింది. ఇవతల కాంతారావు తన్నుకుంటున్నాడు. ఈ అవస్థ ఆ అమ్మాయి (అమ్మాయికాదు ఆడిశక్తి—ఇది కాంతారావు భావం) గమనిస్తేనా?

తలెత్తిచూసి "ఎవరిదండీ ఆ ఆవకాయ జాడీ?" అంది.

కాంతారావు నెత్తిన మరోపిడుగు! అతనికి మండిపోయింది. ఎవరిదైతే యీ మనిషి కెందుకంట? ఈ అమ్మాయిని ఏఅభాగ్యుడు చేసుకుంటాడోగాని,వాడు పెళ్లయినమూడో నాడే సన్యాసం స్వీకరిస్తాడు. నిజం!

మరుక్షణంలోనే తెప్పరిల్లుకుని తడుము కోకుండా జవాబిచ్చాడు: "ఏమోనండీ! తెలీటంలేదు. రైలెక్కినప్పట్నుంచీ చూస్తున్నాను. అదక్కడేవుంది. ఒకటేవాసన. ఎవరు పెట్టి మరిచిపోయి వెళ్లారో పాపం!"

పద్మజ సీరియస్‌గా ముఖంపెట్టింది.

"పాపమేం లెండి. అలాంటివాళ్లను పాపం అనకూడదు. లేకపోతే, మొహం వాచినట్టు—ఈ ఆవకాయజాడీలు నెత్తి నేసుకురావటం దేనికి? తెచ్చారే పో, దాన్ని కుర్తుగా దింపుకోరూ?" అన్నది.

వీపుమీద ఎవరో కొరడాకొసతో చురక వేసినట్టయింది కాంతారావుకు! ఈవిడ అనే మాటలన్నీ పొల్లుపోకుండా తనకేవచ్చి తగులున్నయ్. తగిలినా యేం చేయగలడు, వేలు పెట్టినదొంగ? నోరు మూసుకుని ఆ మాటలన్నీ భరించాడు. ఏ మాట కాదన్నా ప్రమాదమే ఒకవేళ తను తొందరపడి అడ్డుతగిలి "మరీ అలా అనకండి పాపం. పొరబాటనేది అందరికీ వుంటుంది," అంటాడనుకో, ఇక యీవిడకు వేరే చెప్పనవసరంలేదు, ఆ జాడీ తనదేనని. అప్పుడెంత అవమానం ... పరువు పోతుందని, తానిట్లా జాడీ తనది కాదని అబద్ధంచెప్పినట్లు ఈవిడకు తెలిస్తే శివశివా! ఇక తను బతికేంలాభం?

కుక్కినపేనల్లే వూరుకున్నాడు.

ఆవిడ అన్నది: "మరీ ఇంత మతిపరువు మనుషులుకూడావున్నారా అని ఆశ్చర్యం వేస్తుందండీ! వాళ్ళబండబడ."

కాంతారావుకి మతిపోతున్నది. ఎంత దుర్గతిపట్టింది తనకి! పద్మజచేత ఇలాంటి మాటలు తినవలసివస్తుందని తను కలలోనైనా అనుకున్నాడా?

"ఏమోనండీ" అన్నాడు నవ్వుతూ, ఇక ఆమాత్రమైనా మాట్లాడకుంటేబావుండదని - ఆమాత్రమైనా నవ్వకుంటే మర్యాదకాదని.

మళ్లీ అందుకుంది:

"ఛా!ఛా! ఇటువంటివాళ్లుకూడాదేశంలో వున్నారంటే—"

ఏంవుంటేం? ఈవిడకెందుకుపద్రవం? ఈవిడ ఓపట్టాన పోనిచ్చేటట్టులేదేయీవిషయాన్ని!

సమాధానంగా మళ్లీ ఓచవటనవ్వు నవ్వాడు.

"ఏమంటారు?" అంది పద్మజ, అతడు ఆలోచిస్తుండటం చూసి, సమాధానంకోసం డిమాండ్ చేస్తూ. కాని అతడుమాత్రం ఏమంటాడు?

విసుగుకనబరుస్తూ, "పోనిద్దురూ! ఎదవ ఆవకాయి ఎలాపోతే మనకెందుకు?" అన్నాడు, ఇకనైనా ఆ ప్రసక్తినుంచి విడుదల కలుగుతుందని.

కాని అతడు విడుదలపొందటం పద్మజకిష్టంలేదు! "అలాగంటారేం?...ఆవకాయ మీకిష్టంలేదా?" అని అడిగింది.

"ప్చ్! ఇష్టమేమిటిలెండి! ఏదో నూటికొక రోజు వేసుకుంటాను. అసలీ ఆవకాయ, గోంగూర కాయి, ఇలాంటివి మా యింట్లో చెయ్యటమే చాలా అరుదు. అయినా యేం రుచండీ, యీ అవ్వకాలపు వంటకాలన్నీ? ఏదో ముసలాళ్ళకొక్కాని—" అన్నాడు.

"అలా తీసెయ్యకండీ మరీ! అంటూంకాని

ఆవకాయిలో ఎంత స్పిరిట్ వుందని...అసలు తెలుగుదనమంతా దాంట్లోనే వుందేమోనని నా అభిప్రాయం. నామట్టుకు నాకు ఆవకాయంటే చాలాయిష్టం సుమండీ!"

గుండె ఆగినంత పనైంది అతడికి! కాదూ మరి? పద్మజ - మిస్ కాలేజీ పద్మజ - ఆవకాయనుగురించి ఇలా అంటుందని అతడనుకున్నాడా?

చాలా పశ్చాత్తాపపడ్డాడు కాంతారావు. పద్మజకు ఆవకాయ ఇష్టమని తెలిసుంటే, తను ప్లెయిన్‌గా ముందే, ఆ జాడీ తనదేనని చెప్పివుండునుకదా! ఎంతపని జరిగింది? తీరా యిప్పుడేమనుకుంటే యేం లాభం, చేతులుకాలాక! సమయం మించిపోయింది.

ఇప్పుడు చెబితే, ఆ జాడీతనదేనని...ఛా. తలకాయ కొట్టేసినటయిపోదూ? ఈవిడ యీ సంగతి తీసుకుపోయి, కాలేజీలో లేడీస్‌రూం అంతా దండోరా వెయ్యదని నమ్మక మేమిటి?

పోనీ, మరోరకంగా, "ఎవరో వుంచి వెళ్ళారు కాబట్టి దాన్ని నేనన్నా తీసుకువెడతాను" అని చెప్పి తీసుకుపోతే?

ప్చ్!...బాగుండదు. వీడికింత కక్కుర్తి ఏమిటూ అనుకోదూ! కాంతారావు మనస్సులో ఝంఝామారుతం చెలరేగుతోంది.

పద్మజ అటు తిరిగి చూస్తోంది రైలు శరవేగంతో పరుగెడుతోంది. ఆ వేగంలో గాలిహోరుకు పద్మజ ముంగురులు లేచి అటు యిటూ కదుల్తున్నయ్.

తెనాలి స్టేషను సమీపిస్తున్నది.

పద్మజ ఇటు తిరిగి అంది: "ఆ జాడీ ఎవ్వరికీ కాకుండా ఇలా పాడైపోతే బాగుండదండీ. దాన్ని ఏం చేద్దాము?"

అతడికి కొద్దిగా ఆశకలిగింది. ఇప్పుడైనా "నే తీసుకెడతా"నని చెబుదామా అనుకున్నాడు. కాని ధైర్యం చాలలేదు.

"మీరు సందేహిస్తున్నారు కాబట్టిదాన్ని నేనన్నా తీసుకువెడతాను. ఎటూ నేను స్నేహితురాలింటికి వెడుతున్నా నా; ఛాన్సుగా దొరికిన ఆవకాయని తీసుకెళ్ళి వాళ్ళకన్నా ప్రెజంట్ చేస్తాను. వాళ్ళింట్లో ముసలాళ్ళుకూడా వున్నారు. ఇంతకష్టపడి తీసుకుపోయి ఇస్తే వాళ్ళన్నా తేసుకోక పోరు" అన్నది పద్మజ.

ఇందులో ఒక్కొక్క మాటా కాంతారావు గుండెల్లో శూలంగా గుచ్చుకుంటున్నది. కళ్ళు బైర్లు కమ్ముతున్నాయి. ఏమిటీ ఘోరం? నాయనమ్మకోసం అత్తయ్య ప్రీతితో పెట్టిఇచ్చిన ఆవకాయ...ఈవిడ గద్దలాగా తన్నుకుపోతున్నదే. ఇప్పుడేమిటి చెయ్యటం?... ఈవిడగారికి జాడీని ధారపొయ్యటం తప్ప గత్యంతరం లేదా?—

లేదు.

"ఏమిటండీ, అలా ఆశ్చర్యపడుతున్నారు? ఈవిడేమిటి, ఈ జాడీ మోసుకుపోవడమేమిటి, అని ఆశ్చర్యంగా వుందా? నాకు అలాంటి చిన్నతనమేమీ లేదులెండి. ఎంతగా టాప్‌లోవున్నా—కాలేజీలో చదువుతున్నా—మేంకూడా నలుగురితో పాటూ ఉప్పూ, అన్నం తినేవాళ్ళమే" అంది పద్మజ.

దీనికేమని జవాబు చెబుతాడు పాపం, కాంతారావు? దైవోపహతుడు!

"ఛ ఛ. అది కాదండీ. ఎవరు మాత్రం ఉప్పూ, అన్నం కాక మరేం తింటారులెండి. అందులో నిక్షేపంలాంటి కొత్తావకాయ."

"పోనీ మీరు తీసుకు వెళ్ళాలని వుంటే తీసుకుపొండి. నాకేం అభ్యంతరం లేదు. ఎటొచ్చీ పరాయివాళ్ళపాలు కాకుండా మనలో ఎవరో ఒకరు తీసుకెళ్ళడమే ముఖ్యం.

"ఎబ్బే. నాకెందుకండీ. అందులోనూ యిప్పుడు నాకెక్కడ కుదురుతుంది తీసుకుపోయ్యేందుకు. అసలే గాడిదబరువుంది నాకు. దానికితోడు ఇదొకటా? నాకెంత మాత్రమూ అక్కర్లేదు బాబూ, మీరే తీసుకువెళ్ళండి."

ఈ మాటలు అంటున్నప్పుడు చూడాలి కాంతారావు ముఖం. దొరక్క దొరక్క పద్మజతో మాట్లాడే అవకాశం దొరికితే అది సద్వినియోగం కాకపోయె నేఅన్న విచారం—పదిలంగా మోసుకుపోతున్న ఆవకాయిజాడీ తనకు కాకుండాపోతున్నదే అన్న ఏడుపూ—ఇంటికివెళ్ళాక నాయనమ్మకు దీన్నిగురించి ఏం సంజాయిషీ యిచ్చుకోవాలన్న దిగులూ కలిసి అతడి ముఖాన్ని నయాపైసా అంత చేసి పారేశాయి.

చివరకు పద్మజ అంది: "ఆఖరుకు నాకే తోసేశారన్నమాట దీన్ని. సరే కానివ్వండి," కాంతారావుకు అరికాలిమంట నెత్తికెక్కుతోంది. ఈవిడ దీన్ని తీసుకుపోలేదని ఎవడేడిశాడు? అప్పనంగా తన జాడీని తేసుకుపోతున్నది కాక మళ్ళీ మాట్లాడుతోంది — తనకేదో తప్పనిసరైనట్టు.

"ఐతే ఓ సాయంచేసి పెట్టండి. కాస్త యీజాడీని, యీ పేపర్లలో చుట్టి నా పెట్టెలో సర్దిపెడుదురూ, మీకు పుణ్యముంటుంది! దీన్ని విడిగా ఎక్కడ మోసుకుపోను! ఎవరేనా చూసినా అసహ్యంగా వుంటుంది కూడా" అంది పద్మజ.

"ఓ, దానికేం?" అన్నాడు తెచ్చిపెట్టుకుని నవ్వుతూ. ఆనవ్వు నవ్వేందుకు కతడు చాలా బాధపడవలసి వచ్చింది.

పద్మజ పెట్టె తెరిచింది. కాంతారావు ఆవకాయి జాడీని జాగ్రత్తగా కాగితాల్లో ప్యాక్‌చేసి ఆపెట్టెలో సర్దాడు. అతడికాసమయంలో భర్తృహరి సుభాషితాల్లో పద్యం గుర్తు కొచ్చింది: "ఎవ్వరిసొమ్మెంతదిన నెవ్వరికున్నదో ప్రాప్తి..."పద్మజ థాంక్సు చెప్పింది.

అతడికి ఏడుపొచ్చింది: "అయ్యో! ఈ చేతుల్తోనే అత్తయ్య చేతుల్లోంచి జాడీ అందుకున్నాను. ఈ చేతుల్తోనే మోసుకొచ్చాను. ఈ చేతుల్తోనే నాయనమ్మచేతి కందిద్దామనుకున్నాను. కాని...ఈ చేతుల్తోనే యీ దయ్యం (మిస్ పద్మజ!) పెట్టెలో సర్దివేశాను. ఇంతకన్నా దారుణం ఇంకేమన్నా వుందా?" అనుకున్నాడు.

తెనాలి స్టేషను వొచ్చింది. పూర్ణిమనాటి సముద్రంలాగా కల్లోలంగా వున్న యీ తెనాలిస్టేషనూ, కాంతారావు హృదయమూ.

"వస్తానండీ గుడ్‌బై," అని పద్మజతో చెప్పి, ఆవిడ నవ్వుతూ యిచ్చిన బిస్కట్లను ఏడుస్తూ పుచ్చుకుని, పెట్టేబెడ్డింగూ రెండు చేతుల్తో పట్టుకుని బండి దిగాడు కాంతారావు.

గార్డు ఈలవేశాడు. రైలుకదిలి వెళ్ళిపోయింది. పెట్టేబెడ్డింగూ దగ్గరపెట్టుకుని, వెళ్ళిపోయే రైలువేపు చూస్తూ అలాగే నిల్చుండిపోయాడు కాంతారావు. ★



కుమారి సుమతి

గత ఏడాది ఉత్సవాలలో భరతనాట్య ప్రదర్శనమిచ్చి ప్రేక్షకులను ముగ్ధులను చేసింది.

## రాష్ట్రరాజధానిలో
## ప్రాతినిధ్యంతో కోలా
# ఉస్మానియా
# ఆంధ్రాభ్యుద

ఆర్. టి. సి. బస్సులలో ఒక్కొక్క స్తంభం ఉంటుంది. దానిని 'స్తంభం' అని అన్నా లేదా గాడు తెలియదు కాని బస్సులో ప్రవేశించడానికీ, బస్సులోంచి బయటకు రావడానికీ అదే దారి. సాధారణంగా బస్సు వెనుక భాగంలో ఉంటుంది ఈ స్తంభం. బస్సులో ఎక్కిన ప్యాసెంజర్లలో కొందరు సాధారణంగా నిలబడవలసి వస్తుంది. నిలబడవలసి వచ్చినవారు స్తంభం వద్దనే నిలబడతారు—సాధ్యమైనంతవరకు! హఠాత్తుగా బస్సు నిప్పంటుకుంటే, పారిపోవచ్చునని కాదు. గాలి ఆనేది వేస్తే, కాస్త తగులుతుందేమోనన్న ఆశతో. భయంలో కాదు; మలయమారుతం రొదగల కృంగా రాధి ... గాలితో. ఈలోగా కండక్టరు వస్తాడు. కండక్టరు, మీకు తెలుసు, దాదాపు ఆరు గంటలకాలం ఒంటికాలిమీద నిలబడాలి: తన కాలిమీద, ఇతరుల కాలిమీదకూడా! 'ఆగే బఢో!' అంటాడు కండక్టరు.

'ఆగే బఢో' అంటే డిక్షనరీ అర్థం మీకు తెలుసు. 'ముందుకు నడవండి, మహాశయా, మీకో నమస్కారం' అని. అంటే లోపలికి వెళ్ళండి అని. స్తంభం బస్సుకి వెనుక భాగంలో కాక ముందు భాగంలో నే ఉన్నదనుకోండి. కండక్టరు చెప్పేదేకదా అని మంచి చెడ్డా ఏమీ లేకుండా ముందుకు పోకూడదు. బస్సుకి ఏది ముందుకి అని ప్రశ్నించకూడదు. 'ఆగే బఢో' అంటే ఇక్కడ కండక్టరు ఉద్దేశ్యం 'వెనక్కి వెళ్ళండి, మహాశయా!' అని. కండక్టరు ఉద్దేశ్యం గమనించి ప్రవర్తించాలి: యథా కండక్టర్, తథా ప్యాసెంజర్!

ఆగేబఢో అంటే తెలుగులో డిక్షనరీ అర్థం చెప్పాను. ఇలాంటి డిక్షనరీ అర్థమే సంస్కృతంలో 'అభ్యుదయం' అని. ఇది రైటవునా కాదా అని సందేహ పడకండి. సందేహాలు పండితులకి వదిలేద్దాం! మనం పండితులం కామని మనకి తెలుసు, వాళ్ళకీ తెలుసు. మనకు తెలుసన్న ఈ డిక్షనరీ అర్థంతోనే ముందుకు పోదాం!

ప్రతీ సంవత్సరంలాగే ఈ ఏడుకూడా ఉస్మానియా తెలుగు విద్యార్థులు ఆంధ్రాభ్యుదయోత్సవాలు జరుపుతున్నారు. నగరంలోని ముప్పైఒక్క కళాశాలల తెలుగు విద్యార్థులు సమిష్టిగా జరుపుతున్న ఉత్సవాలివి. ప్రతీ ఏడూ డిసెంబరు

## ★ తురగా కృష్ణ

మాసంలో జరిగే ఈ ఉత్సవాలకు వేలకొలది ప్రేక్షకులు హాజరౌతారు. మొదటిరోజు దాదాపు మూడు నాలుగువేల మంది స్త్రీ పురుషులు ఈ ఉత్సవాలను సందర్శిస్తే, మూడవ, నాలుగవ రోజుల కార్య



శ్రీ రఘురామరావు
[కోశాధ్యక్షులు]



పి. పుల్లారెడ్డి
[ఆర్థిక కార్యదర్శి]

...లో 31 కళాశాలల

...హాలంగా సాగుతున్న

# విద్యార్థుల ...హోత్సవాలు

...కమునికి దాదాపు ఏడెనిమిది వేలమంది ...వస్తారు. సాయంత్రం ఐదు ...గంటలకు ప్రారంభమయే సాంస్కృతికోప...న్యాసాలను వినాలన్న ఉత్సాహం కొంద...కి ఐతే, రోజూ రాత్రి ప్రదర్శింపబడే

...మోహనరావు 

...నాటకాలను, నృత్యాలను చూడాలన్న అభి...లాష మరికొందరికి ప్రేరేపకారణం ...గొతుంది. ప్రతి సంవత్సరంవలెనే ఈ సంవ...త్సరం కూడా ఉత్సవాలకు వేలకొలది ...ప్రేక్షకులు వస్తారనడంలో సందేహం లేదు.

ఈ నెల 18 వ తేదీన ప్రారంభించి 16 వ తేదీవరకు జరుగుతాయి ఈ ఉత్సవాలు. మొదటి మూడు రోజులు సాయంకాలం ఐదు, ఐదున్నరకు ప్రారంభమై రాత్రి పది గంటలవరకు జరుగుతాయి. మొదట సాంస్కృతిక విషయాలపై పెద్దల ఉపన్యాసాలు; తరువాత రోజుకు మూడు నాలుగు కళాశాలల విద్యార్థుల తెలుగు ఏకాంక నాటికల ప్రదర్శనాలు. నాల్గవ రోజు కార్యక్రమం బహుమతి ప్రదానంతో అంతమౌతుంది. నాటికల పోటీలలో, వక్తృత్వ వ్యాసరచనల పోటీలలో, సంగీతాది లలితకళల పోటీలలో నెగ్గిన విద్యార్థులు, విద్యార్థినులు బహుమతులను స్వీక



వి. భాస్కరరావు
[స్థానిక కార్యదర్శి]



ఎం. ప్రభాకరరెడ్డి
[ప్రధాన కార్యదర్శి]



కుమారి జానకీరాణి

రచయిత్రే గాక, నర్తకి కూడా. గత ఏడాది ఈమె రాధాకృష్ణ నాట్యం ప్రేక్షకుల ప్రశంసల నందుకున్నది.

రిస్తారు. ఈ కార్యక్రమం పూర్తి అయేసరికి రాత్రి పన్నెండు గంటలు దాటుతుంది. హైదరాబాదులో చలి ఎక్కువ; డిసెంబరులో మరీ ఎక్కువ. ఐనా తాము చూసిన నాటికలలో ఏది గెలుపొందినదో చూడాలనే ఉద్దేశ్యమో, మరి కేవలం కుతూహలమో, వేలకొలది ప్రేక్షకులు తుదివరకు వేచిఉండి, బహుమతిప్రదాన కార్యక్రమం చూసి గృహోన్ముఖులౌతారు.

తమకు గాని, తమ కళాశాల ప్రతినిధులకు గాని, తమ కళాశాలకే గాని బహుమతులను గెలుచుకొన్న విద్యార్థులు, విద్యార్థినులు, ఉత్సాహంతో, గర్వంతో, బహుమతులను మిత్రులకీ, అధ్యాపకులకీ, తమ ప్రధానాధ్యాపకులకీ చూపిస్తారు. ఆంధ్రేతరులైన ప్రధానాధ్యాపకులకి కూడా తమ విద్యార్థుల విజయం గర్వకారణం కాబట్టి, విద్యార్థులు ఈ కార్యక్రమాలలో పాల్గొనడానికి అవకాశాలు కల్పిస్తారు.

బహుమతీ ప్రదానోత్సవం ఒకవిధంగా చూస్తే, ఆ సంవత్సరం కార్యక్రమాలకన్నింటికీ ఒక ముద్ర వంటిది. నెలల తరబడి వివిధ కళాశాలల విద్యార్థులు ఎడతెరపి లేకుండా చేసిన కృషి బహుమతీప్రదాన కార్యక్రమంతో సమాప్తమౌతుంది. కర వేగంతో



ఉత్సవాల నిర్వాహకవర్గం.

ఎడమనుంచి కుడికి: (1) గురువారెడ్డి (2) రామగోపాల్ రెడ్డి (3) ఎస్. నరసింహారావు (4) కుమారి టి. లీల (5) ఎస్. రామలింగరాజు.

# ఉస్మానియా విద్యార్థుల ఆంధ్రాభ్యుదయోత్సవాలు

ఉన్నాన్న పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని, కావ్యగ్రంథాలను బూజు దులపడం ప్రారంభిస్తారు విద్యార్థి నాయకులు.

సాధారణంగా జూలై ఆగష్టు నెలలకి ప్రతి కళాశాలలోను తెలుగు విద్యార్థి సంఘాల ఎన్నికలు పూర్తి అవుతాయి. బహుభాషా ప్రాంతమైన హైదరాబాదు నగరములోని కళాశాలలో ప్రతిభాషకి ఒక విద్యార్థి సంఘము స్థాపించడం, ఈ విద్యార్థి సంఘం తమ మాతృభాషలో సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించడం, ఒక తెలుగు పత్రిక నడపడం ఆచారం. హైదరాబాదు కళాశాల విద్యార్థుల ప్రత్యేకత ఈ కార్యక్రమాలను తమంత తామే నిర్వహించుకొనడంలో వుంది. ఆచార్య వర్గంలో ఒకరిని 'హితవరి' గా ఎన్నుకున్నా, సర్వసాధారణంగా వారు సహృదయతతో ఆ హోదాలో వ్యవహరిస్తారు. విద్యార్థుల సంచికలలో తామే సంపాదకీయాలు వ్రాస్తామని, అవసరమున్నా లేకపోయినా, సమంజసమయినా కాకపోయినా, తమకు అభిమానుల చిత్రాలను ప్రకటిస్తామని పట్టుపట్టి, తమ 'ఆచార్యత్వాన్ని' సార్థకం చేసుకోవాలని చూసే ప్రముఖులు కూడా లేకపోలేదు. కాని సర్వసాధారణంగా ఆచార్యవర్గం విద్యార్థులు కోరినంత మేరకు, వారు కోరినవిధంగా తమ సహకారాన్ని లభింపజేస్తుంది. ఈ కళాశాలల తెలుగు సారస్వత సమితులు కార్యక్రమ నిర్వహణలోని విశిష్టతకి తార్కాణం ఈ మధ్య ఉస్మానియా ఆర్ట్సు కాలేజి కళాశాల తెలుగు సారస్వత సమితి నిర్వహించిన భారతోపన్యాసాలు, అష్టదిగ్గజ వర్ధంతి ఉపన్యాసాలు.

## అధ్యాపకుల సహకారం

సెప్టెంబరు మాసాంతంలో వివిధ కళాశాలల ప్రతినిధులు సమావేశమై ఆంధ్రాభ్యుదయోత్సవ కార్యక్రమ నిర్వహణకై కార్యవర్గాన్ని, కార్యదర్శులను, అధ్యక్ష కోశాధ్యక్షులను ఎన్నుకుంటారు. మొదటి నుంచి కూడా విద్యార్థులు నిర్వహించే ఈ అభ్యుదయోత్సవాల సక్రమ నిర్వహణ కోసం విద్యార్థులే అధ్యాపక వర్గములో ఇరువురిని అధ్యక్ష, కోశాధ్యక్ష పదవులకు ఎన్నుకుంటారు. వేలకొలది రూపాయల వ్యయంతో కూడుకొన్న ఈ కార్యక్రమానికి సంబంధించినంతవరకు విద్యార్థుల పట్ల రాని ఉత్సాహాన్ని ఒక త్రోవను పెట్టించడానికి ఈ అధ్యక్ష, కోశాధ్యక్షుల నియామకం ఎంతో ఉపయోగపడుతుంది. నిజాం కళాశాల తాత్కాలిక ప్రధానోపన్యాసకులు శ్రీ యన్. ప్రసాదరావు, న్యూసైన్సు కళాశాలలో ఉపన్యాసకులు శ్రీ రఘురామరావు ఈ సంవత్సరం అధ్యక్ష, కోశాధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. శ్రీమతి వి. కామేశ్వరి (వినోదకార్యదర్శిని), శ్రీయుతులు వి. భాస్కరరావు (స్థానిక కార్యదర్శి), వి. పుల్లారెడ్డి (ఆర్థిక కార్యదర్శి), యం. ప్రభాకరరెడ్డి (ప్రచార కార్యదర్శి), విద్యార్థులనుండి కార్యదర్శులుగా ఎన్నుకోబడ్డారు. వీరుగాక విరుగురు కార్యవర్గ సభ్యులుగా ఎన్నుకోబడ్డారు. కళాశాలకి ఇరువురు ప్రతినిధుల చొప్పున 31 కళాశాలలకి అరవై ఇద్దరు ప్రతినిధులు సర్వసభ్య సమావేశంలో ఉంటారు. ఉత్సవసమయం దాపుకి వచ్చిన ప్పటి నుంచి కార్యవర్గం దాదాపు ప్రతిదినం సమావేశమౌతుంది. దైనందిన కార్యక్రమ నిర్వహణను, కార్యవర్గపు సూచనల ననుసరించి కార్యదర్శులు సాగిస్తారు.



శ్రీ ఎన్. ప్రసాదరావు

[అధ్యక్షులు: ఆంధ్రాభ్యుదయోత్సవాల నిర్వహణ సంఘం]

సెప్టెంబరు మాసాంతంలోనో, అక్టోబరు ప్రారంభంలోనో ఈ ఎన్నికలు పూర్తి పోతాయి. వెంటనే కార్యదర్శులతో సహకరించడానికి నాలుగు ఉపసంఘాలు ఏర్పడతాయి. ఉత్సవ నిర్వహణకు విరాళాలను సేకరించడం, సేకరించిన ధనాన్ని ఉత్సవ సంబంధమైన కార్యక్రమాలకు సక్రమంగా వ్యయమయ్యేటట్లు చూడడం ఆర్థిక కార్యదర్శి, అతనికి తోడ్పడే ఉపసంఘంవీరి బాధ్యత. విభిన్న విషయాలలో పోటీలను నిర్వహించడం స్థానిక కార్యదర్శి, అతని ఉపసంఘం వారి బాధ్యత. వినోద కార్యక్రమాలను నడపడం, ఉపన్యాసాలకు ప్రముఖులను ఆహ్వానించడం వినోద కార్యదర్శిని శాఖ. ప్రచార కార్యదర్శి విధులేమిటో ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదు. ప్రతి ఉపసంఘంలోను ఒకరో ఇద్దరో అధ్యాపకు లుంటారు.

ఎన్నికలు కాగానే, పని చురుకుగా సాగుతుంది. అన్ని పనులకి అందరూ బాధ్యులే వినా-ప్రధానంగా ఎవరిశాఖ వారిది. వినోద కార్యదర్శిని బాధ్యత ఉపన్యాసలివ్వడానికి, ప్రారంభోత్సవానికి, బహుమతులు పంచిపెట్టడానికి పెద్దలను గాలించి పట్టుకు

రావడం. ఆంధ్రదేశం అదృష్టం వల్ల కాబోలు (దురదృష్టం కూడా కావచ్చు) పిల్లలందరూ, కవులతో సహా, త్వరతరగా పెద్దవాళ్ళయి పోతున్నారు! పెద్దలందరూ (గత సంవత్సరపు రుషానులా) పనికిరాని వాళ్ళయి పోతున్నారు!

రాజకీయ నాయకులకు సంబంధించినంత వరకు వినోద కార్యదర్శి పని సులభమే. కవులు, కళాకారులకు సంబంధించినంత వరకు అతని కార్యక్రమం కొద్దిగా కష్టమౌతుంది. కవులు సాధారణంగా తమ జీవనభృతి కోసం ఏలాగో ఆఫీసు గుమాస్తాలుగా పనిచేయవలసిన రోజులు కాబట్టి, ('సాధారణంగా' అనడం సాహిత్య అకాడమీ కవులను మినహాయించడం కోసం) శిరస్తదారు మనస్తత్వం పై ఉత్సవాల విజయం ఆధారపడి ఉంటుంది. మరీ పెద్ద కవులు, కళాకారులు సినీమాలలో ఉంటారు. వారు రావడం కాల్ షీట్ల ఉధృతం మీద ఆధారపడి ఉంటుంది. వినా వినోద కార్యదర్శినిగా పట్టువల, ఓర్పు ఉన్నవారిని ఎన్నుకొంటారనుకొంటాను! మొత్తం మీద కార్యక్రమాలను దిగ్విజయం చేస్తారు వీరు.

## చందాల వసూలు

ఆర్థిక కార్యదర్శి సంగతి చెప్పక్కర్లేదు. అందరూ విరాళాలు సేకరిస్తున్నా, కార్యక్రమ నిర్వహణకు అవసరమైన డబ్బును సేకరించే బాధ్యత అతనిది. ఈ కార్యదర్శి మన కన్నా మంత్రులందరినీ మించి పోతాడు! ఎక్కడైనా డబ్బు గలగలలాడితే చాలు రసీదు పుస్తకం తెరుస్తాడు! నేను నిజంగా రూఢిగా జరిగిందని చెప్పలేను కాని, 'స్వర్గం నుంచి ఎవరో మనిషి ఆంధ్రదేశంలో దిగాడు!' అని ఎవరో చెప్పారట అతనితో. వెంటనే రసీదు పుస్తకం చేతిలో పెట్టి, 'ఆంధ్రాభ్యుదయోత్సవాలకి చందా ఇస్తాడేమో కనుక్కో!' అన్నాడట అతను. ఇది రూఢిగా జరిగిందని చెప్పలేము కాని, జరిగినా ఆశ్చర్యం లేదు!

ఉత్సవాలకు పోటీల నిర్వహణ అంతా స్థానిక కార్యదర్శి బాధ్యత. ఒక్క చదువులో తప్ప, అన్నింటిలోను పోటీలు జరుపుతారు నిర్వాహకులు. చదువు విశ్వవిద్యాలయానికి వదలవలసిందే గదా! వాద్యసంగీతాలలో పోటీలు, చిత్రలేఖనంలో పోటీలు-ఒకటేమిటి! చదువులో తప్ప మిగిలినవాటన్నిటిలో పోటీలు జరుపుతారు.

వ్యాసరచన పోటీలో పాల్గొనే విద్యార్థులను మూడు శ్రేణులుగా విభజించి, సమాన స్థాయి గలవారందరికీ పోటీలు జరుపుతారు. సాంస్కృతిక, ఆర్థిక రాజకీయ విషయాలలో ఒక విషయం పై విద్యార్థుల వ్యాసాలను



కుమారి కె. విద్యావతి; కుమారి వి. జయలక్ష్మి.
నారాయణగూడ బాలికోన్నత పాఠశాల విద్యార్థినులు. గత ఏడాది అంతఃపాఠశాల వక్తృత్వపు పోటీలో షీల్డ్ గెలి- పాఠశాలకు ఖ్యాతి తెచ్చారు.

ఇద్దరో ముగ్గురో న్యాయమూర్తులు పరిశీలించి, మూడు శ్రేణులలోనూ ప్రథమ ద్వితీయ బహుమానాలిస్తారు.

వక్తృత్వ పోటీల విషయంలో ఉస్మానియా విద్యార్థుల విశిష్టత, విద్యార్థులలో అధిక సంఖ్యాకులు వేదికపై నిలబడి సభాకంపం లేకుండా మాట్లాడగలగడంలో ఉంది. ఇంతమంది విద్యార్థులు మాట్లాడగలగడం మరెక్కడా కనపడదు! ఈ విషయంలో కళాశాలలో నిజాం కళాశాలది; పాఠశాలలలో నారాయణగూడా బాలికోన్నత పాఠశాలది ప్రత్యేకత. పాఠశాలల



శ్రీమతి వి. కామేశ్వరి
[వినోద కార్యదర్శిని]

మధ్య జరిగే వక్తృత్వ పోటీలలో బహుమానాలన్నీ దాదాపు ఈ పాఠశాల విద్యార్థినులే సంపాదించుకొన్నారు. ఇదివరలో ఆంధ్రాభ్యుదయోత్సవాలలో జరిపిన పోటీలో మూడుసంవత్సరాలు వరసగా ప్రథమ బహుమతి తెచ్చుకొని, 'షీల్డు' స్వంతం చేసుకొన్నారు. జరుగుతున్న ఏడాదికి ఈ పాఠశాల జట్టు ప్రథమ బహుమతి సంపాదించుకొన్నది.

నిజాం కళాశాల విద్యార్థులు కూడా వక్తృత్వ పోటీలలో పేరు తెచ్చుకున్నారు. ఈ సంవత్సరం ప్రథమ బహుమతి పండిత శ్రీ వెంకటాచార్య ఇదివరలో రెండుమార్లు ప్రథములుగా నిలిచినవారు.

దాదాపు అన్ని పోటీల ఫలితాలు ముందే తెలిసిపోతాయి. కాని నాటికల పోటీల ఫలితాలకోసం తుదిఘట్టం వరకు వేచిఉండవలసి వస్తుంది. కారణం చివరి రోజున కూడా కొన్ని నాటికలు ప్రదర్శిస్తారు. మొత్తం ఒక్క కళాశాలల నాటకాలు నాలుగు రోజులలో ప్రదర్శించడం సాధ్యం కాదు కాబట్టి, ముందుగానే పోటీజరిపి పన్నెండో, పదహారో నాటికలను మాత్రమే ఎన్నుకుంటారు.

## ఆంధ్రేతరులలో పోటీ

అసలు పోటీలుండడం మంచిదే! విద్యార్థులలో సమర్థత పోటీలవల్లనే వెలికివస్తుంది. బహుమానం వస్తుందనే ఆశతో విద్యార్థులు

(47-వ పేజీ చూడండి)

# నక్షత్ర ఫలితాలు

**( 18-12-57 మొదలు 24-12-57 వరకు )**

గ్రహస్థితి

| | | | |
|---|---|---|---|
| | కే | | |
| | తుల, వృశ్చిక, ధనుర్మకరములలో చంద్రుడు. | | |
| శు | | | |
| ర శ | బు కు | గు రా | |

*** అశ్విని [చూ, చే, చో, లా] ***

ఈ వారము మీకు కలిగిన చిక్కులు తీరిపోతవి. అనుకున్న డబ్బు చేతికి వస్తుంది. పెద్దల సాంగత్యమువల్ల నూతనాంశాలు తెలుసుకుంటారు. కోర్టువ్యవహారములు పరిష్కారానికొస్తాయి. పిల్లల క్షేమాభివృద్ధికి తగిన ఏర్పాట్లు చేస్తారు. పండితులకూ, న్యాయవాదులకూ మేలు కలుగుతుంది. విద్యార్థుల చదువు చురుకుగా సాగుతుంది. 18, 19, 20 తేదీలలో శ్రమతో కూడిన కార్యక్రమము. ఆ పైని కార్యానుకూలత, శుభయోగము. నటీనటులకు యోగకాలము.

*** భరణి [లీ, లూ, లే, లో] ***

ఈ వారము ఆర్థికాభివృద్ధితోబాటు మీ హోదాకూడా ఎక్కువ అవుతుంది. బంధువులను కలుసుకుంటారు. కళాకారులతో వినోదిస్తారు. గృహమందు కలిగిన అనారోగ్యము తొలగుతుంది. విద్యార్థులకు చదువుపై శ్రద్ధ కలుగుతుంది. వర్తకులకు ప్రయాణమువల్ల లాభము. దూరమున ఉన్న ఆత్మీయుల క్షేమము తెలిసి ఆరాటన తొలగుతుంది. గాయకులకూ, కవులకూ, నటీనటులకు యోగకాలము. 18, 19, 20 తేదీలలో శ్రమతో కూడిన కార్యక్రమము. 21, 22, 23 తేదీలలో ప్రయాణము, లాభము, క్షేమవార్త.

*** కృత్తిక [అ, ఈ, ఉ, ఏ] ***

ఈ వారము మీకు యోగదాయకము. పోయినవారమందు అసంపూర్తిగా నిలిచియున్న పనులు ఈ వారము లాభకరముగా ముగిస్తారు. వాహనయోగము కలదు. వర్తకులకు ముఖ్యముగా నూలు, బట్టల వ్యాపారస్తులకు లాభము. విద్యార్థులు శ్రద్ధగా చదువుకుంటారు. కవులకు, గాయకులకు, కళాకారులకూ, నటీనటులకూ యోగకాలము. 18, 19, 20 తేదీలలో త్రిప్పట, శ్రమ, అశాంతి. 21, 22, 23 తేదీలలో స్త్రీలతోనూ, ఆప్తులతోనూ విందు, వినోదము, శుభవార్త.

*** రోహిణి [ఓ, వా, వీ, వూ] ***

శరీరమునకు ఎక్కువ శ్రమ కలిగే పనులు చేయవలసివస్తుంది. ఆర్థికస్థితి ఏమంత తృప్తికరముగా వుండదు. అవసరములు తీరక గృహకలతలు కలుగుటచే మనస్సునకు అశాంతి కలుగుతుంది. కార్యభారముచే అకాలభోజనము చేయుటవల్ల ఆరోగ్యము చెడుతుంది. కోర్టువ్యవహారములు వాయిదాపడుతవి. వర్తకులకు శ్రమ ఎక్కువ. 18, 19, 20 తేదీలలో ఉద్యోగస్తులకు ఒత్తిడి ఎక్కువ; ఆపైని మెరుగుగా ఉంటుంది. విద్యార్థులకు శ్రద్ధ తక్కువ.

బి. నరసింగరావు

*** మృగశిర [వే, వో, కా, కీ] ***

ఈ వారము మీకు అంతయోగముకాదు. మొదట్లో కార్యభంగమైనట్లు కనబడి నిరాశ కలిగినా క్రమేణా కొందరు మిత్రులు సహాయపడి కార్యసిద్ధి కలిగిస్తారు. ఉద్యోగస్తులకు ఆర్థికముగా ఒత్తిడి ఎక్కువ. వ్యాపారస్తులకు మాంద్యము. విద్యార్థులకు చదువుపై అశ్రద్ధకలుగుతుంది. 18, 19, 20 తేదీలలో అవసరాలు తీరనందున గృహకలతలు, మనోవ్యథ. 21, 22, 23 తేదీలలో ప్రయాణము, మిత్రసహాయము, కార్యసిద్ధి.

*** ఆరుద్ర [కూ, ఘ, ఙ, ఛ] ***

ఈ వారము ఖర్చులు ఎక్కువ. తలపెట్టిన పనులు ఫలించకపోవచ్చును. సంసారముపట నిర్లిప్తత కలదనే అపోహవల్ల గృహకలతలు వస్తాయి. సజ్జనసహవాసమువల్ల ఆధ్యాత్మిక చింతవల్ల మనశ్శాంతి కలుగుతుంది. ఉద్యోగస్తులు కొంత కష్టపడినప్పటికి మేలు పొందుతారు. విద్యార్థులకు చదువుమీద శ్రద్ధ తక్కువైననూ క్రొత్త విషయాలు నేర్చుకుంటారు. 18, 19, 20 తేదీలలో కార్యసాధనలో జాప్యము, అశాంతి. 21, 22, 23 తేదీలలో పెద్దల సాంగత్యము, విజ్ఞానలాభము, వారాంతమున కొంత మేలు.

*** పునర్వసు [కే, కో, హా, హీ,] ***

ఈవారము కార్యభారము ఎక్కువవుతుంది. బంధువుల రాకవల్ల ఖర్చులు ఎక్కువ. ధనలోపమువల్ల అస్థిమితము కలుగుతుంది. కోర్టువ్యవహారములు కొంత మేరకు మీ పరముగా తీర్పు అవుతాయి. ఉద్యోగులకు శ్రమ; వ్యాపారస్తులకు అశాంతి. స్త్రీలతో వివాదము. ఆరోగ్యభంగము; ఇంటనే శ్రద్ధ వహించడము మేలు. విద్యార్థులకు చదువుపై శ్రద్ధతక్కువ 18,19, 20 తేదీలలో కార్యభారమువల్ల అలసట, ఆరోగ్యభంగము 21, 22, 23 తేదీలలో కొంత కార్యానుకూలత, ఊరట.

*** పుష్యమి [హూ, హే, హో, డా] ***

ఈవారము మీరు సాహసముతో పనులు ప్రారంభిస్తారుగాని కొనసాగవు. మీరాబడి గృహావసరాలకు సరిపడక కష్టపడతారు. కుటుంబకలతలు, గాయములు తగులుట వంటి ప్రమాదములు కలుగుతాయి. అధికారుల పోటుమాటలచేత ఉద్యోగస్తులు వ్యథ పొందుతారు. ఖనిజములు, లోహముల వ్యాపారస్తులకు శ్రమకలిగినను వారాంతమున లాభయోగము వుంటుంది. 18,19,20 తేదీలలో కార్యభంగము,అనారోగ్యము,ఆపైని శాంతి.

*** ఆశ్లేష [డి, డూ, డే, డో] ***

ఈవారము హోదాలోవున్న వారిమాట సహాయమువల్లనూ మీ బుద్ధిబలముచేతనూ ప్రయత్నించిన కార్యములు నెరవేరుతాయి. ధనాదాయము ఎక్కువవుతుంది. కొత్తవారితో పరిచయము కలుగుతుంది బంధువులను కలుసుకొనుట, శుభకార్యనిశ్చయము చేయుట మొదలగు శుభయోగములు కలుగుతాయి. ఉద్యోగస్తుల హోదా పెరుగుతుంది. కవులకు సన్మానము జరుగుతుంది. వైద్యులకు మేలుకాలము. శిల్పులకు, చిత్రకారులకు ప్రోత్సాహముంటుంది. 18,19,20 తేదీలలో ప్రయాసము అధికఖర్చులు. 21, 22,23,24 తేదీలలో ప్రయాణము. మిత్రలాభము, కార్యసిద్ధి. నటీనటులకు యోగము.

*** మఖ [మా, మీ, మూ, మే] ***

ఈవారము మీకు మంచియోగము, విద్వాంసులవల్ల క్రొత్త సంగతులు తెలుసు

కుంటారు. కోర్టువ్యవహారములు అనుకూలముగా పరిష్కారమవుతాయి. ధనాదాయము పెరుగుతుంది. విద్యార్థులు ఉపయోగకరమైన విషయాలు నేర్చుకుంటారు. ఉద్యోగస్థుల హోదా వృద్ధిఅవుతుంది. పిల్లల అభివృద్ధికి ఏర్పాట్లుచేస్తారు. న్యాయవాదులకు, పండితులకు, కళాకారులకు యోగము. 18,19, 20 తేదీలలో కార్యాచరణలో శ్రమ; ఆపైని పండితసాంగత్యము, ధనయోగము, కార్యానుకూలత.

### * పూర్వ ఫల్గుణి (పుబ్బ) *
### [ మో, టా, టీ, టూ ]

ఈ వారము యత్నకార్యములు అనుకూలిస్తాయి. మిత్రులతో వినోదములలో పాల్గొంటారు. దూరమందున్న బంధువుల క్షేమవార్తవల్ల కొంతకాలమునుండి మీకూ, మీ కుటుంబమునకు వున్న ఆందోళన తొలగుతుంది. విద్యార్థులకు నూతనోల్లాసము కలుగుతుంది. వెండి మొదలగు ధాన్యవస్తువుల వ్యాపారస్థులకు ప్రయాణమువల్ల లాభము కలుగుతుంది. 18, 19, 20 తేదీలలో కార్యాచరణలో త్రిప్పట, అలసట 21, 22, 23, 24 తేదీలలో కార్యసిద్ధి, ధనలాభము, శుభయోగము, కళాకారులకు, కవులకు, నటీనటులకు యోగము.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### [ టే, టో, పా, పి ]

ఈ వారము యత్నకార్యములు ఫలిస్తాయి. ధనాదాయము వృద్ధి అవుతుంది. పుణ్యకార్య ధర్మకార్యాచరణలలో పాల్గొంటారు. కోర్టు వ్యవహారములు మీ పరముగా తీర్పుఅవుతాయి. వాహనయోగము కలుగుతుంది. పిల్లల శుభకార్యాలోచనలు ఫలిస్తాయి. విద్యార్థులు ఉత్సాహముగా ఉంటారు. వర్తకులకు ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో లాభము కలుగుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 18, 19, 20 తేదీలలో కార్యాచరణలో శ్రమ, త్రిప్పట. 21, 22, 23, 24 తేదీలలో ప్రయాణము, కార్యసిద్ధి, బంధువులతో విందుభోజనము, ధనలాభము.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

మీ ధనాదాయమును వృద్ధి చేసుకునే ప్రయత్నాలు ఫలించవు. అనుకున్న సహాయము పితృవర్గమునుండి సకాలమునకు రానందున అవసరాలు తీరక గృహకలతలు ఏర్పడుతాయి. కార్యభారముచే శరీరస్థితి, మానసికస్థితి అసంతృప్తికరముగా వుంటుంది. అకాల భోజనమువల్ల ఆరోగ్యము చెడుతుంది. వెంటనే శ్రద్ధ తీసుకోండి. వర్తకులకు ఒడిదుడుకులు; ఉద్యోగస్థులు కొత్త సమస్యలవల్ల చిక్కులు. 18, 19, 20 తేదీలలో, కార్యభంగము, శ్రమ, అశాంతి. 21, 22, 23 తేదీలలో స్వల్పలాభము.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈవారము సకాలములో డబ్బు చేతికి అందకపోవుటచేత తలపెట్టిన పనులు నెరవేరక వ్యథపడతారు. శత్రువని మీరు అపోహపడిన వ్యక్తి సమయానికి ఆదుకొని కార్యసిద్ధికి మీకు సహాయము చేస్తాడు. వ్యాపారస్థులకు మొదట్లో ప్రతికూలముగా వుండి వారాంతములో లాభిస్తుంది. విద్యార్థులకు చదువుపై అశ్రద్ధ. 18, 19, 20 తేదీలలో కార్యభంగం, ఆర్థికలోపము. 21,22, 23 తేదీలలో మిత్రసహాయము, కార్యసిద్ధి.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈ వారము అనుకున్నట్టుగా పనులు జరుగకపోవుటచేతనూ, కోరిన సహాయము లభించకపోవుటచేతనూ అవసరములు తీరక గృహకలతలు వస్తాయి. అయినను ఓర్పుతో కార్యసాధనకు ప్రయత్నిస్తారు. జ్ఞానుల ఉపదేశమువల్ల ఈశ్వరానుగ్రహముచే అన్నీ కుదుటపడతాయని నమ్ముతారు. ఆత్మశాంతి కలుగుతుంది. వర్తకులకు మొదట్లో త్రిప్పట, ఆశాభంగము; వారాంతమందు,లాభము. విద్యార్థులకు చదువు సాగదు. 18, 19, 20 తేదీల త్రిప్పట, శ్రమ, కార్యభంగము. 21, 22, 23 తేదీలలో సాధుసాంగత్యం, శాంతి, లాభం.

### *విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈవారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. కార్యభారము అధికమవుటవల్ల శ్రమ. కోర్టువ్యవహారములు కొంత అనుకూలిస్తవి. ఇచ్చిపుచ్చుకునేపట్ల నీచస్త్రీలతో వివాదము, మనోవ్యథ. భార్యకు అనారోగ్యము. విద్యార్థులకు బద్ధకము. 18, 19, 20 తేదీలలో కార్యభంగం, వివాదం ఆరోగ్యచింత. 21, 22, 23 తేదీలలో త్రిప్పట, కార్యానుకూలత, వర్తకులకు శ్రమతో కూడిన లాభం.

### *అనూరాధ [నా, నీ, నూ, నే]*

ఈవారము మీశక్తినంతను ఉపయోగించి కార్యాచరణకు మొదలుపెట్టిననూ ఫలము కలుగదు. పట్టుదల ఎక్కువగుటచేత అధైర్యపడక ప్రయత్నములను విడవరు. అదియే పరిరైవతీరు; క్రమేణా కష్టములను తీర్చి మేలు పొందిస్తుంది. సోదరుల సహాయసానుభూతుల వల్ల ఒడిదుడుకులు సర్దుబాటు అవుతవి. యంత్రములవల్లగాని అగ్నివల్లగాని ప్రమాదసూచన ఉన్నది. జాగ్రత్తపడిన తప్పవచ్చును. రాసాయనిక వ్యాపారస్థులకు లాభము. 18, 19, 20 తేదీలలో త్రిప్పట, కార్యభంగము, మనోవ్యథ. 21, 22, 23 తేదీలలో సహాయము, కార్యానుకూలత, స్వల్ప శుభయోగము.

### *జ్యేష్ఠ [నో, యా, యి, యూ]*

ఈ వారము మీ స్వశక్తి చేతను, బుద్ధిబలముచేతను కార్యసాధనచేసి మంచి ఫలితాలు పొందుతారు. అధికారులు సహాయము చేస్తారు. కొత్తవ్యక్తుల పరిచయము కలుగుతుంది. శుభవార్తలుగాని, బంధువుల క్షేమసమాచారముగాని తెలుస్తాయి. మందుల వ్యాపారస్థులకు వైద్యులకూ లాభం. గణితశాస్త్రజ్ఞులకూ, శిల్పులకూ, చిత్రకారులకూ, కవులకూ యోగకాలము. 18, 19, 20 తేదీలలో కార్యభారమువల్ల త్రిప్పట, శ్రమ. 21, 22, 23, 24 తేదీలలో కార్యసిద్ధి.

### *మూల [యే, యో, బా, బీ]*

ఈవారముమీకుయోగకాలము,గ్రంథపఠనమువల్లవిజ్ఞానుల పరిచయమువల్ల జ్ఞానాభివృద్ధి పొందుతారు. విద్యార్థులకుచదువుచురుకుగా సాగుతుంది. ఉద్యోగస్థులకు ఆర్థికాభివృద్ధి కలుగుతుంది; హోదా పెరుగుతుంది. వర్తకు

## ధరలు

నూలు, వస్త్రములు :— తగ్గుదలలో వుండును.

నూనెదినుసులు: మందమగును.

బెల్లము, పంచదార, చింతపండు :— స్వల్పముగా తగ్గును.

ఆహార ధాన్యములు :— మందముగా వుండును.

పప్పుదినుసులు: నిలకడగా వుండును.

వెండి, బంగారము : స్వల్పముగా పెరిగిననూ, వెంటనే తగ్గును.

దక్షిణదేశమున వర్షించును. అచ్చటచ్చట కొద్దిగా వాయుపీడన కలుగును.

జన్మనక్షత్రమునుబట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారివారి పేర్లననుసరించి పేరు మొదటి అక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకోనునది. కృష్ణుడను పేరునకు మృగశిరానక్షత్రమును, హృష్టుడను పేరునకు స్వాతియును, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకోనునది.

 

# నక్షత్రఫలితాలు



లకు లాభం. న్యాయవాదులకు, పండితులకు కళాకారులకు యోగకాలము. 18, 19, 20 తేదీలలో తెరిపిలేని కార్యక్రమమువల్ల అలసట. 21, 22, 23, 24 తేదీలలో కార్యసిద్ధి. సంతానమునకు మేలు.

### *పూర్వాషాఢ [బూ, ధ, ఫా, ఢ]*

ఈ వారము మీ ఆర్థికస్థితి బాగుంటుంది. యత్నకార్యములు అనుకూలిస్తవి. బంధుమిత్రులతో వినోదములో పాల్గొంటారు. వాయవ్యదిక్కునుండి శుభక్షేమ వార్తలు తెలుస్తాయి. వెండిసరుకుల వర్తకులకు లాభం. విద్యార్థులు శ్రద్ధగా చదువుకుంటారు. కవులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 18, 19, 20 తేదిలలో కార్యభారమువల్ల త్రిప్పట, అలసట, 21, 22, 23, 24 తేదీలలో కుశలవార్త, ఆర్థికలాభం, కార్యసిద్ధి, ప్రయాణసూచన.

### *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వారము యోగప్రదము. ధనాదాయము వృద్ధిపొందుతుంది. వాహనయోగము ప్రబలముగావుంది. పుణ్య, ధర్మకార్యాలలో పాల్గొంటారు. యత్నకార్యములు సిద్ధిస్తాయి. బంగారు వ్యాపారస్తులకు, బట్టల వర్తకులకు లాభము. విద్యార్థులకు నూతనోల్లాసము కలుగుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలం. 18, 19, 20 తేదీలలో కార్యాచరణవల్ల శ్రమ, 21, 22, 23, 24 తేదీలలో ప్రయాణం, బంధుదర్శనం, విందుభోజనము, కార్యలాభము.

### *శ్రవణము [జూ, జే, జో, ఘా]*

ఆర్థికాభివృద్ధికి మీరు చేసేపనులు విఫలమవుతాయి. మీకుకలిగిన ధనసహాయమువల్ల అవసరాలు తీరక గృహకలతలు వస్తాయి. కార్యభారముచే శరీరస్థితి చెడుతుంది. వెంటనే శ్రద్ధవహించండి. ఉద్యోగస్తులకు క్రొత్త సమస్యలు తలెత్తుతాయి. వర్తకులకు ఆందోళన. 18, 19, 20 తేదీలలో త్రిప్పట, కార్యభంగము, అనారోగ్యము. 21, 22, 23, 24 తేదీలలో పితృవర్గమునుండి సహాయము. స్వల్పలాభము, ప్రయాణము.

### * ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈవారము సకాలములో డబ్బు చేతికందక తలపెట్టిన కార్యములు నెరవేరవు. ఇంతవరకూ తటస్థముగా వున్న వ్యక్తి సమయమునకు ఆదుకొని సహాయముచేయగా విచిత్రముగా కార్యసిద్ధిని పొందుతారు వ్యాపారస్తులకు మొదట్లో ఆశాభంగముకలిగి వారాంతమున లాభిస్తుంది విద్యార్థులకు చదువుమీద శ్రద్ధతక్కువ. 18, 19, 20 తేదీలలో శరీరాయాసము, ఆశాభంగము, అధిక ఖర్చులు, ప్రయాణము. 21, 22, 23, 24 తేదీలలో వింతసహాయము, కార్యసిద్ధి.

### *శతభిషం [గో, సా, సీ, సూ]*

ఈ వారము తలపెట్టిన పనులు ఫలించవు. అనుకున్న సహాయము లభించదు. గృహావసరములు తీరక కలతలు వస్తాయి. అయిననూ దైవకృపవల్ల అన్నికష్టములు గడుస్తాయని ధైర్యముతో మెలుగుతారు. 18, 19, 20 తేదీలలో వర్తకులకు త్రిప్పట కలిగి ఆశాభంగమైననూ వారాంతమున లాభము కలుగుతుంది. 21, 22,23, 24 తేదీలలో ఉద్యోగస్తులకు అనుకూలము.

### * పూర్వాభాద్ర [సే, సో, దా, దీ] *

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. కోర్టు వ్యవహారములు అనుకూలిస్తవి. కార్యభారము అధికమై శ్రమ, అశాంతి, స్త్రీలతో వివాదము కలిగి ఖేదపడతారు. భార్యకుగాని, ఇంట్లో ఇతరస్త్రీలకుగాని ఆరోగ్యము చెడుతుంది. 18, 19, 20 తేదీలలో ఆర్థికఒత్తిడి, కార్యభారముచే త్రిప్పట, ఆరాటన, ఆరోగ్యచింతచే వ్యథ. 21, 22, 23 తేదీలలో ప్రయాణము, స్వల్పలాభము.

### *ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా] *

ఎక్కువ శ్రమకలిగే పనులు తలపెట్టి, కార్యసాధన కానప్పటికి నిరుత్సాహము పొందక, సోదర సహాయంవల్ల నిర్వహిస్తారు. ఉద్యోగస్తులకు అధికారుల పోటుమాటచే వ్యథ. గృహకలతలవల్ల అశాంతి. యంత్రములవల్లగాని, ఆయుధములవల్లగాని ప్రమాదము. జాగ్రత్త అవసరము. 18, 19, 20 తేదీలలో త్రిప్పట, శ్రమ, అశాంతి. 21, 22 23, 24 తేదీలలో ఖనిజ లోహముల వ్యాపారస్తులకు లాభము.

### * రేవతి [దే, దో, చా, చీ] *

మీ బుద్ధిబలమువల్ల, విజ్ఞానుల సలహాలవల్ల మీకు కలిగిన చిక్కులను గడిచి శుభయోగం పొందుతారు. మిత్రులను కలుసుకొనుట, కార్యసాధన, శుభవార్త వినవచ్చుట మొదలగు మంచిఫలితాలు కలుగుతాయి. విద్యార్థులు క్రొత్తవిషయాలు నేర్చుకుంటారు. ఇంటియందుండు వారి ఆరోగ్యం బాగుపడుతుంది. 18, 19, 20 తేదీలలో ప్రయాణమువల్ల శ్రమ, అధికఖర్చులు, 21, 22, 23, 24 తేదీలలో కార్యానుకూలత, మిత్రలాభము. విజ్ఞానాభివృద్ధి. కవులకు, చిత్రకారులకూ, కళాకారులకూ, నటీనటులకూ మేలుకాలము.



# వనితా లోకం

## 'కొండమీది కోతి!'

సామాన్యంగా, అసందర్భపు పనులు చేసీ అనవసరపు మాటలాడి, పొరపాటయిందని, సమర్థిస్తుంటారు. పొరపాటనేది అందరూ చేసేదే కాని, ఒక్కొక్కప్పుడు, పొరపాటే అలవాటయి, దాన్ని మానలేకుండా పోతాం. అదో బలహీనత క్రింద, మారిపోతూ వుంటుంది. మాటల సందర్భంలో దీంతో చావొచ్చింది. "చచ్చా ననుకోండి" కొంప మునిగింది; ఏడిచావ్ లేస్తూ, ఏడిచినట్టుంది, 'నీబొంద' 'నాపిండాకూడు' తాడు తెగిందిలే, అంటూ మాటలు దొర్లించేస్తూ వుంటారు. మా తమ్ముడికి, ప్రైవేటు చెప్పేందుకు, ఓ మేష్టారు వచ్చేవారు. ఆయన పాఠాలు మొదలుపెట్టినది మొదలు, "ఏడిచి నట్టుంది, ఈ వ్రాత" ఏడిసిందిలే చదువుమళ్ళీ అంటూ. పది మాట్లయినా అనే వారు.

మా తమ్ముడు ఏడిసే మేష్టారు వస్తున్నార్రోయ్" అంటూ, అల్లరిచేసి చివరికి వాడికా మాట పట్టుపట్టి కూచుంది. ఒకసారి, మా పెదనాన్నగారు మా అక్కయ్యకి ఒక సంబంధం, తెచ్చి, "మీ పెత్తల్లి ఈ సంబంధమయితే, బాగుండునంటోంది" అని విడమర్చి చెబుతున్నారు. అందరితోపాటు శ్రద్ధగా వింటున్న తమ్ముడు "ఏడిసింది లేస్తూ" అన్నాడా సంబంధాన్ని గురించి కాని మా పెదనాన్న, పెత్తల్లినే అన్నాడని మహా ఇదయిపోయారాయన. వాడి నడిగితే అలా అనలేదంటాడు. అలవాట నేది అలాంటిది మరి.

ఉన్న కొద్దీ ఈ గాడిదకు అల్లరి ఎక్కువవుతోందని, ఆనాడు రెండు తగిలించినా, వాడు మానలేదు. సరికదా అలా వాణ్ణి మందలించి బెదిరించి నామటుకు నేను గాడిద అనటం, అలవాటయి కూర్చుంది! దాన్ని వదలటం నావల కాలేదు.

నేను కొత్తగా, కాపురానికి వెళ్ళేటప్పుడు బాధపడటం చూచి అన్నయ్య నన్ను, నవ్వించాలని; "అదేమిటి చెల్లాయ్ అలాగున్నావ్ నీకేది కావాలన్నా ఉత్తరం రాసెయ్, "కొండ, మీద, కోతినైనా తెచ్చి పెడతా సరేనా" అన్నాడు నవ్వుతూ.

అంత బాధలోనూ నవ్వొచ్చింది, "అలాగే అన్నయ్యా" అన్నా.

పండుగకు పుట్టింటి కొచ్చాను, "ఏం చెల్లెమ్మా ఒక్కసారైనా, ఈ అన్నయ్య అవసరం రాలేదా అన్నాడు నవ్వుతూ మాటల సందర్భంలో.

"అదేమి అన్నాయ్ అలా అంటున్నావ్, అందుకేగా నే వొచ్చింది" అన్నా.

అయితే చెప్పు, కొండమీద కోతైనా సరే," అన్నాడు ధీమాగా పోజు పెట్టి.

★ సరోజ ★

(మద్రాసు)

"నిజంగా" అన్నా మళ్ళీ.

"ఆలస్య మెందుకూ అడుగూ అన్నాడన్నయ్య"

"ఏం లేదన్నయ్యా, నువ్వు సిగరెటు కాల్చటం మానెయ్యాలి" అని అడిగానంతే. అన్నయ్య పది నిముషాలు దీర్ఘంగా ఆలోచించి "అలాగే మానేస్తున్నాను చెల్లీ" అన్నాడు రాని నవ్వు నవ్వుతూ.

అంతే ఆరోజునుండి సిగరెట్లు మానేశాడు కాని అన్నయ్య అవస్థ చూసినప్పుడు జాలేసేది. నాన్నగారు చాలా మెచ్చుకున్నారు. పండుగెళ్ళి పోయింది నేనూరెళ్ళాను. మర్నాడే మా తమ్ముడు ఉత్తరం వ్రాశాడు.

"అక్కయ్యా నువ్వు దింపివెళ్ళిన కోతి మళ్ళీ కొండెక్కి కూచుంది.

చదివి నవ్వుకున్నాను అలా జరుగుతుందని ముందే అనుకున్నాను గనుక బాధనిపించలేదు. కాని అన్నయ్య సిగరెట్లయితే తాగాడు గాని, కొండమీదికోతి ప్రస్తావన మరి ఎన్నడూ రాలేదు.

రెండేళ్ళ క్రిందటి మాట. మా ప్రక్కింటివారమ్మాయి, మహాఅల్లరి చేస్తుండేది. తల్లి విసుక్కుంటూ ఆపిల్లకి నాలుగు తగిలిస్తూండటం చూసి జాలేసేది. ఆ అమ్మాయిని తీసుకునివచ్చి, ఆడించి, జడలల్లి పంపేదాన్ని. తీరికగ వున్నప్పుడు కొన్నాళ్ళయ్యేసరికి ఆతల్లి అస్తమానం పంపడం మొదలెట్టింది. పనిగా వున్నప్పుడూ ఏదేనా చదువుతున్నప్పుడూ, ఆ అమ్మాయి గీతారాగం ఆలాపిస్తూ వస్తే మహా చిరాకేసేది. కాని అలవాటు ప్రకారం ఆడించి లాలించనిదే వూరుకునేది కాదు. మరి నా పన్లెంకాను? తప్పుతుందా అదినీ పొరపాటే అన్నారు మా వారు చికాగ్గా. అలా ఆ అమ్మాయికి అలవాటయింది. అందులో ఆ పాప తప్పేముంది? అయినే ఆ పొరపాటు నాదా! ఆ తల్లిదా చెప్పండి! ఏది ఎలాగయినా ఆ యిల్లు మార్చినంతవరకు అలవాటుమాత్రం తప్పలేదు.

ఈ మధ్య మా చిట్టిబాబుకు నాల్గు రోజులు జ్వరం వచ్చి చాలా చిక్కిపోయాడు. ఏదీ సయించక తినటం మానేశాడు. ఎలాగయినా తింటే చాలని ఓనాడు నీళ్ళు పుక్కిలిస్తే చాలునని చెప్పి రొట్టె కాఫీ తాగించాను. వాడిక ప్రతిరోజూ పళ్ళు తోముకోనని అల్లరి చెయ్యడం సాగించాడు. పొరపాటు నాదేగనుక, క్రమంగా ఓర్పుతో వాడి అలవాటు మాన్పించాను. పిల్లాడిని చూడాలని వాళ్ళ తాతయ్య వచ్చారు. ఆయన చిట్టిబాబుమీద ప్రేమ కొద్దీ ఎత్తుకు తిరగడం, బిస్కట్లూ అవీ, ఎక్కువ పెట్టటం అల్లరి చేసినా ముద్దులాడటం, పై నెక్కించుకొని వుప్పు ఆట ఆడించటం చేసేవారు. పది రోజులుండి వెళ్ళిపోయారాయన. వాడు మా పని పట్టించాడంటే నమ్మండి.

ఆ అలవాట్లు మానేందుకు వాడూ, మేమూకూడా నానా అవస్థాపడ్డాం. పెద్దవాళ్ళ విషయం ఎవరికివారు ఆలోచించగలం. చిన్నపిల్లల విషయంలో మాత్రం పొర

(40-వ పేజీ చూడండి)

### ప్రతి పుస్తకానికి ఒక పఠిత ★ ★
### ★ ★ ప్రతి పఠితకూ ఒక పుస్తకం

# స్త్రీలూ, గ్రంథాలయాలూ


కె. నాగేశ్వరరావు
గ్రంథాలయ నిర్వాహకులు
శాఖా గ్రంథాలయం, తెనాలి.


"గ్రంథాలయములు: స్త్రీలు" అను విషయముపై అభిప్రాయ వేదికకు అవకాశము కలుగుట్ట ముదావహము. ఈ వేదికయందు యింతవరకు పలువురు తమ అభిప్రాయములు తెలిపియున్నారు. శ్రీ సరోజిని దేవిలాంటి వారు కొందరు ఆదరణీయమైన సలహాలను గూడ యొసంగియున్నారు. అయితే కొందరు అసలు విషయము వదలి "పురుషులు పుస్తకాలు చదువరు" అని యొకరు "చాలమంది స్త్రీలు సినిమాలు, నాటకాలు మొదలైన వాటికి తమ మగవారు వెంటరాకపోయినా భయం, విడియంలేకుండా ఒక్కగా వెళ్తారు..." అని యింకొకరు పరస్పర నిందారోపణలు చేసికొనుట మంచిదికాదు. ఇటువంటి నిందారోపణలు సమస్య పరిశీలనకు తోడ్పడ మొసగజాలవు. స్త్రీలకు ప్రత్యేక గ్రంథాలయములు అవసరమా? అనునది ప్రస్తుత ప్రధాన సమస్య. కోరిన పుస్తకములు లభించుటెట్లు? స్త్రీలు గ్రంథాలయములను ఉపయోగించుకొనేటట్లు ప్రోత్సహించుటకు అవలంబింపవలసిన పద్ధతులేవి? అనునవిగూడ పరిశీలించవలసిన ప్రధాన విషయములు.

## స్త్రీలకు ప్రత్యేక గ్రంథాలయములు

దాదాపు 36కోట్ల పైగా జనాభాగల మన దేశములో దాదాపు 32,000 గ్రంథాలయాలు గలవు. ఇందులో చాలా పేరునకు మాత్రమే గాని గ్రంథాలయమున వుండవలసిన మంచి లక్షణములలో ఒక్కటి గూడ యుండదు. ఇక పుస్తకముల సంఖ్యను బట్టి జూచిన ప్రతి 50 మందికి ఒక పుస్తకము మాత్రమే మన దేశములో లభ్యమవుతూ యున్నది. బ్రిటన్ దేశములో ప్రతివ్యక్తి సగటున సంవత్సరమునకు ఏడు పుస్తకములు, అమెరికాలో నాలుగుపుస్తకములు చదువుచున్నాడు. కాని మన దేశములో చదువుకొన్న ప్రతివ్యక్తి సంవత్సరానికి ఒక పుస్తకము చదువుతున్నాడు. దీనిని బట్టి మనకంటె బ్రిటనువారు ఏడురెట్లు, అమెరికావారు నాలుగురెట్లు గ్రంథపఠనము గావించుచున్నారని తెలియగలదు. కాన మన దేశములో పురుషులతోపాటు, దాదాపు సగము జనాభాగల స్త్రీలలో గూడ అక్షరాస్యులను పెంపొందించి, పఠనాసక్తి కలుగజేయవలసిన యవసరమెంతేని గలదు. రేపటి పౌరులగు బాలబాలికలను పెంచవలసిన స్త్రీ విద్యావివేకములను కలిగి యుండకపోయిన దేశ భవిష్యత్తునకు యొనలేనిహానికలుగగలదు. అక్షరజ్ఞానము కలవారు స్వయముగా విజ్ఞాన సముపార్జన మొనరించుకొనుటకు, గ్రంథాలయములు విశ్వవిద్యాలయములుగా ఉపయోగపడగలవు.

## ప్రభుత్వం లక్ష్యం

మన దేశములో ప్రతి గ్రామమందును, పట్టణమందును కనీసము ఒక గ్రంథాలయము యేర్పాటు చేయవలయుననునది ప్రభుత్వ ఆశయము. ఈ ఆశయమును ఆచరణలో పెట్టుటకుగాను, మద్రాసు, ఆంధ్రప్రదేశ్ మొదలగు ప్రాంతములలో గ్రంథాలయ శాసనములు రూపొందినవి. గ్రంథాలయ సేవా విస్తరణకుగాను కట్టుదిట్టమగు ప్రణాళికలు ఆచరణలో పెట్టబడుచున్నవి. కేంద్రప్రభుత్వము, ప్రథమ పంచవర్ష ప్రణాళికయందు గ్రంథాలయముల అభివృద్ధికిగాను దాదాపు 89 లక్షల రూపాయలను ఖర్చు పెట్టియున్నది. ద్వితీయ పంచవర్ష ప్రణాళికయందు 140 లక్షల రూపాయల మొత్తము గ్రంథాలయాల అభివృద్ధికి కేటాయింపబడినది. మన ఆంధ్ర ప్రాంతములో గల పదకొండు జిల్లా కేంద్ర గ్రంథాలయములు గూడ కేంద్రప్రభుత్వ సహాయమును పొందుచున్నవి. ఇప్పుడిప్పుడే మన దేశములో గ్రంథాలయములు అటు ప్రభుత్వపు తోడ్పాటుతోను, ఇటు ప్రజల సహకారముతోను అభివృద్ధి చెందుచున్నవి. అయితే దేశ ఆర్థికపరిస్థితుల ప్రభావమువలన గ్రంథాలయ విస్తరణను, మన అవసరాలకు తగినట్లు త్వరితముగా సాధించుకొనలేకపోవుచున్నాము.

## కాబట్టి

గ్రంథాలయాలప్రయోజనాన్ని ప్రజలిప్పుడిప్పుడే గ్రహించుచున్నారు. అధిక జనాభా నివసించేది గ్రామ ప్రాంతాలలోనే. అక్కడ గ్రంథాలయముల సంఖ్య అతి స్వల్పముగా యున్నది. కనీసము ప్రతి గ్రామమునకొక గ్రంథాలయాన్ని స్థాపించి గ్రామీణులు వాటిని యుపయోగించుకొనేటట్లు చూడవలసి యున్నది. ఇటువంటి పరిస్థితులలో స్త్రీలకు ప్రత్యేక గ్రంథాలయములు కావలయునను నినాదము ఎంతవరకు సమంజసమో సోదరీమణులు గ్రహించగలరు.

స్త్రీలకు ప్రత్యేక గ్రంథాలయముల వలన ప్రయోజనము లేదని తెలుపుట ఈ వ్యాసంయొక్క యుద్దేశ్యము గాదు. ప్రత్యేక విద్యాసంస్థలవలన స్త్రీలు యొక్కువ ప్రయోజనమొందుచున్నట్లుగనే ప్రత్యేక గ్రంథాలయముల వలన అధిక ప్రయోజనము పొందగలరనుట నిర్వివాదాంశమైన విషయము. ఉదాహరణకు మా తెనాలి పట్టణమందలి శాఖాగ్రంథాలయములో స్త్రీలకు ప్రత్యేక విభాగమున్నను దినమునకు సగటున పదిమందికంటె యెక్కువ హాజరుగారు. కాని ప్రత్యేకముగా స్త్రీలకొఱకై తెఱచియుంచు ఒక్క శుక్రవారపు సాయంత్రమున దాదాపు డెబ్బదిమంది హాజరగుచున్నారు. అయితే అసలు గ్రంథాలయాలే లేని గ్రామముల నేకం ఉండగా స్త్రీలకుగూడ గ్రంథాలయాలు ప్రత్యేకముగా ఏర్పాటు చేయవలయునను తలంపు మంచిదే యైనను ఆచరణయోగ్యమైనది గాదు. అందువలన గ్రంథాలయసేవను అంచెలవారీగా ఒకనిర్ణీతకార్యక్రమము ననుసరించి ప్రజలకందజేయవలసి యున్నది.

(39-వ పేజీ చూడండి)

# ఆప్లికో వర్క్

**రెండో ప్రపంచ యుద్ధం 1939 నాటి పూర్వం, మన వూళ్ళలో రోడ్లమీద సైకిళ్ళకి మూటలు కట్టుకుని ఇంటింటా తిరిగి పెద్ద పెద్ద డిజైన్లు ఎంబ్రాయిడరీ చేసి కుట్టిన దుప్పట్లూ, టేబుల్ క్లాత్‌లూ, దిండు గలీబులూ, మొదలైనవి చైనావాళ్ళు అమ్ముతూ వుండేవారు. ఆ రోజుల్లో చైనావారు కుట్టు పనులలో ప్రసిద్ధికలిగి వుండేవారు. షాపుల్లో అమ్మకం చేసే చైనాదేశపు స్త్రీలు ఒక ప్రక్కన బేరాలు సాగిస్తూనే మరోప్రక్క రకరకాల అల్లికలూ, కుట్లూ, మొదలైన చేతిపనులను అతి సునాయాసంగా చేసే వారట. వారి నైపుణ్యం ప్రశంసనీయం గదా!**

**అన్నంరాజు రమణమ్మ**
(గుంటూరు)



చైనావాళ్ళమ్మే వాటన్నింట్లోకీ, తెలుపు మీదా, దళసరిరకం కాటన్ బట్టమీద అప్లికోవర్క్ కుట్టిన పూవులూ, ఆకుల డిజైన్లూ, పెద్ద పెద్ద బాతులూ, హంసలూ, మొదలైన జంతువుల బొమ్మల డిజైన్లూ చాలా బాగుండేవి.

పెద్ద పెద్ద పట్టణాల షాపుల్లో యేమో గాని మన మామూలు బస్తీల్లో యిప్పుడు యీరకం కుట్టుపని చేసిన బట్టలు దొరకటం లేదు. ఈ కుట్టు మనం స్వయంగా కుట్టుకో వచ్చును. అప్లికోవర్క్ తేలిక. ఆడంబరం లేకుండా అందంగా వుంటుంది.

టేబుల్ క్లాత్ గాని దుప్పటికిగాని కుట్టే బట్టకు వేరుగా యింకొక బట్టమీద డిజైను ట్రేస్ తీసుకుని, ఆ డిజైనును కాజాకుట్టు (బటన్ హోల్ స్టిచ్)లో, క్రిందబట్టకు కలిపి కుట్టి అతుకుతారు. అప్లికో కుట్టడానికి, తీసుకున్న బట్టకీ, పైన అతికికుట్టే 'డిజైన్ బట్టకీ,' కుట్టేదారాలకీ, రంగులు కలిసేటట్లు చూసుకోవాలి. అప్లికోవర్క్ అందమంతా రంగుల సెలెక్షన్‌లోనూ, జాగ్రత్తగా కుట్టడంలోనూ వుంటుంది.

బజార్లో దొరికే రంగుపాప్లిన్ బట్టమీదా క్రేప్‌సిల్క్ బట్టమీదా కూడా యీ అప్లికో వెయ్యవచ్చును.

ముదురునీలం బట్టమీద లేతనీలంబట్ట డిజైనూ, క్రీమ్‌కలర్ బట్టమీద లేతనీలం, లేత ఆకుపచ్చ, రంగుడిజైన్లు కుడితే బాగుంటాయి.

లేత నీలం, లేత ఆకుపచ్చ, క్రీమ్‌కలరూ బట్టలకి డార్క్ రెడ్, డార్క్ బ్లూ (ముదర ఎర్రుపు, నీలం) డిజైన్లు అతికికుట్టినా బాగా వుంటాయి.

చిన్న చిన్న డిజైన్లకు ఒకేరంగు బట్ట వాడినా, పెద్దపెద్దపూలూ, ఆకులూ, గల డిజైన్లకు పూలకు ఆకులకు తీగలకు వేరు వేరు రంగుల బట్టలపై డిజైన్లువేసి అన్నీ కలిపి అతికి కుట్టవచ్చును.

పైనయిచ్చిన డిజైన్‌లో మూడు పువ్వులూ, ఐదాకులూ, కొన్ని కాడలూ, వున్నాయి.

ఈ డిజైను టేబుల్ క్లాత్ మూలలకు బాగుంటుంది.

క్రీమ్‌కలర్ పాప్లిన్‌బట్ట మనం కుట్టదలచుకున్న టేబుల్ క్లాత్ సైజుకి కత్తిరించి పెట్టుకోవాలి.

లేతనీలం రంగుగాని, ముదురు నీలం రంగుగాని పాప్లిన్‌బట్ట సుమారు 12 అం. చదరం తీసుకుని పైడిజైను దానిపైన ట్రేస్ తీసుకోవాలి. పన్నని పదునుకత్తెర తీసుకుని డిజైన్ అంచుల (అవుట్ లైన్) వెంబడే జాగ్రత్తగా కత్తిరించాలి. ఈ కత్తిరించిన డిజైను అడుగున జిగురురాసి టేబుల్ క్లాత్ బట్టలపైన మనం కుట్టదలచినచోట కదలకుండా అంటించాలి. లేదా సన్నటి టాకాలు అవుట్‌లైన్ వెంబడేపోసి కుట్టి అతకవచ్చును.

తర్వాత ముదురు నీలం డిజైనైతే లేతనీలం దారమూ, లేతనీలం డిజైనైతే ముదురు నీలం రంగు దారమూ, సూదికి యెక్కించి డిజైను అవుట్‌లెన్ వెంబడే కాజాకుట్టు (బటన్ హోల్ స్టిచ్) మరీ దగ్గరగా కాకుండా కొంచెందూరంగా కుట్టుకుంటూ వెళ్ళాలి. ఇదేవిధంగా డిజైన్ చుట్టూకుట్టి పూర్తి చేయాలి.

లోపలి ఆకుల గీతలకూ పువ్వుల గీతలకూ, కాడకుట్టు కుట్టాలి.

పువ్వులకు ఆకులకు వేరురంగు బట్టవాడినప్పుడు వేరు వేరు రంగుదారాలతో చుట్టూ బటన్‌హోల్ సిచ్‌కుట్టవచ్చును. డిజైన్ బట్ట రంగూ, కుట్టేదారాల రంగూ మాచ్ అయేట్లు చూసుకోవాలి.

కొంచెం శ్రమపడి పెద్దసైజు టేబుల్ క్లాత్ లు ఓ రెండు కుట్టివుంచుకుంటే చిన్న చిన్న పార్టీలవంటిసందర్భాలలో వాడటానికి చాలా బాగుంటాయి. పిల్లలు వాడుకునే బట్టలకు చిన్న చిన్న పిట్టల బొమ్మలూ జంతువుల బొమ్మలూ, కుడితే వాళ్ళకి చాలా సరదాగా వుంటుంది. 

# వంటలు

## బ్రెడ్‌తో హల్వా

దీనికి కావలసిన సామాన్లు: చిక్కని పాలు శేరుంపావు. సవాశేరు చక్కెర. తాజా బ్రెడ్ ఒకటి (రొట్టె) అణా యాలకాయలు. సవాశేరు కమ్మనినెయ్యి, సవాపావు జీడిపప్పు.

తయారుచేయువిధం: యాలకాయలు పొడిచేసి వుంచవలెను. జీడిపప్పు బాగుచేసి కొంచెం నేతిలో వేయించి వుంచవలెను. పావుశేరు పాలల్లో చక్కెర, బ్రెడ్ త్రుంచి అదీ వేయవలెను. మిగతా శేరుపాలు కళాయి గిన్నెలో పోసి పొయ్యిమీదపెట్టి మధ్య మధ్య గరిటతో త్రిప్పుచుండవలెను. కొంతసేపటికి కోవా తయారవుతుంది. ఈలోపల బ్రెడ్ నాని చక్కెర కరిగివుంటుంది కోవా గట్టిపడగానే నానిన బ్రెడ్‌ను కోవాలో వేసి

## కొత్తపల్లి రాజ్యలక్ష్మి

(చిన్నగంజాము)

~~కలియబెట్టవలెను. అప్పుడు కోవా ముద్దవలె~~ పడుతుంది. బ్రెడ్ బాగా కోవాలో కలిసి పోయేలాగున కలియబెట్టి సన్నని సెగలో గరిట క్రిందికి దించకుండా త్రిప్పుతూ కొద్దికొద్దిగా నెయ్యి పోస్తుండవలెను. నెయ్యి అంతా అయిపోయేటప్పటికి గోధుమరంగులో చక్కగా ముద్దవలె తయారై ఘుమఘుమలాడు తుంది. అప్పుడు జీడిపప్పు యాలకుపొడి వేసి కలియబెట్టి క్రిందికిదించి వాడుకొనవలెను. ఇది పిల్లలు ఎంత తిన్నప్పటికీ జబ్బు చెయ్యదు. ఇది నాలుగైదు రోజులు నిలువ ఉంటుంది.

## అమర్‌సాలు

దీనికి కావలసిన వస్తువులు: తాజామైదా లేక గోధుమపిండి అర్ధశేరు. అరకప్పుకోవా. నిమ్మకాయంత వెన్నగాని కమ్మనినెయ్యిగాని, సవాశేరు చక్కెర, అరతులం యాలకాయలు అరపాను డాల్డాగాని నెయ్యిగాని.

తయారుచేయుపద్ధతి: మూడు పావుశేర్ల చిక్కని పాలల్లో ఒక పావుశేరు పాలు విడిగా తీసి తక్కిన అర్ధశేరు పాలను పొయ్యిపైపెట్టి గరిటతో త్రిప్పుచుండవలెను. కొంతసేపటికి గట్టిపడి కోవా తయారవుతుంది. గట్టిపడు సమయానికి క్రిందికిదించి మైదాపిండి వెన్న తూనవేసి బాగాకలిపి కొంచము కొంచముగా పాలుపోస్తూ పూరీ పిండివలె కలుపవలెను. ఒకగంట నానినపిదప పీటమీదవేసి బాగా మర్దనచేసి అరచేతి మందాన పూరీవలె వత్తి మధ్యలో నెయ్యి రాసి చాపవలెచుట్టి దానిని మళ్ళీ గుండ్రముగాచుట్టి మళ్ళీ పూరీవలె అరచేతిమందాన చేసి, హార్లిక్సుసీసా మూతతోగాని గ్లాసుతో గాని యీ పూరీమీద త్రిప్పిన, గుండ్రముగా బిళ్ళలవలె వస్తవి. పళ్ళెములో విడివిడిగా పెట్టుకొని అన్నీ తయారుచేసుకొని పొయ్యిమీద కళాయిపెట్టి నెయ్యివేసి కాగిన తరువాత యివి ఒక్కొక్కటి వేసి దోరగా వేగిన తరువాత తీసివెయ్యవలెను. ఆ విధముగా అన్నీ తయారయిన తరువాత అన్నీ విడివిడిగా వెడల్పయిన పళ్ళెములో పేర్చి, పంచదారలో పావుశేరు నీళ్ళుపోసి పొయ్యిమీదపెట్టి ముదురు పాకంపట్టి క్రిందికి దించి యాలకులు పొడిచేసి అదివేసి ఒక్కొక్క దానిమీద స్పూనుతో పాకాన్ని పొయ్యవలెను. రంగు కావలె ననుకొనువారు చిటికెడు మిఠాయిరంగు, టీస్పూను పాలల్లో కలిపి, పాకంలో పొయ్యవలెను. ఇంకా అమర్‌సాలు అందముగా నుండవలెనంటే ఎండుకొబ్బరి సన్నగా తురిమి ఆకుపచ్చరంగు పైన చెప్పినట్లుగానే పాలతో కలిపి కొబ్బరి తురుముకు పటించి అమర్‌సాలమీద పాకం పొయ్యగానే వేడిమీదనే కొంచము కొంచముగా కొబ్బరి తురుము వేసిన అంటుకొనిపోతుంది. చూచుటకు అందంగా తినుటకు రుచిగా ఉంటవి. పాకం మాత్రం బాగా ముదరనివ్వవలెను. ★





# ★ స్త్రీలూ, గ్రంథాలయాలూ ★

(౩౧ వ పేజీ తరువాయి)

ప్రథమదశగా ప్రతి పట్టణమందును, గ్రామమందును గ్రంథాలయములు స్థాపించి వాటి యందువిధిగా స్త్రీలకు, పిల్లలకు ప్రత్యేక విభాగము లుండునట్లు చేయవలయును. స్త్రీల విభాగమునకు ప్రత్యేక ప్రవేశద్వార ముండునట్లుచేసి ఒక స్త్రీనే ఆ విభాగమును నిర్వహించుటకు నియమించవలయును. ప్రస్తుతము స్థానిక గ్రంథాలయ సంస్థలయందు సభ్యురాండ్రుగా పనిచేయుచున్న స్త్రీలు ఈ విషయమునందు ప్రత్యేకశ్రద్ధ తీసికొన వలసియున్నది. అక్షరాస్యులు పెరిగి ప్రతివారు గ్రంథాలయ ప్రయోజన మెరిగి ఉపయోగించుకొనుటకు మొదలిడినప్పుడు గ్రంథాలయసంస్థల ఆర్థిక పరిస్థితులు పటిష్ఠముగానున్నప్పుడు, స్త్రీలకేగాకుండా పిల్లలకు గూడ ప్రత్యేక గ్రంథాలయములు ఏర్పాటు చేసుకొనగలము.

## ఆరోపణలు

గ్రంథాలయమునందు కోరినపుస్తకములు లభించుట లేదను ఆరోపణ స్త్రీలనుండియేగాక పురుషులనుండిగూడ వినవచ్చుచున్నది. గ్రంథాలయము లిప్పుడిప్పుడే స్థాపింప బడుచుండుటయు, పుస్తకములు తగినన్ని లభింపక పోవుటయు, లభించిన పుస్తకముల నన్నిటిని ఖరీదుచేయు ఆర్థికస్తోమత గ్రంథాలయాలకు లేకపోవుటయు ప్రజలలో పఠనాసక్తి క్రమముగా పెరుగుటయు ముఖ్య కారణములు. దీనికితోడు, కొనదగు పుస్తకములను ఎన్నిక చేయుటలో చదువరుల కోరికలను, అభిరుచులను బాగుగా నెఱిగియున్న గ్రంథాలయ నిర్వాహకునికి తగు స్వతంత్రం లేనందువలన, ఆ గ్రంథాలయ ప్రాంతప్రజల అభిరుచులకు తగు పుస్తకములు గ్రంథాలయమునం దుండక పోవుట సంభవించుచున్నది. ముఖ్యముగా ప్రతివారు చదువు పుస్తకములను రెండుమూడుప్రతులను గ్రంథాలయమువారు తెప్పించి, విధిగా అందొక ప్రతిని స్త్రీల విభాగమునం దుండునట్లు చూడవలయును. అంతేగాక ఒకే యాజమాన్యము క్రింద నడుపబడు పది పదిహేను మైళ్ళ ప్రాంతములో గల గ్రంథాలయము లన్నింటిని ఒక యూనిట్ గా నిర్ణయించి, పుస్తకములను ఒక గ్రంథాలయమునుండి మరియొక గ్రంథాలయము వారు ఇచ్చి పుచ్చుకొను సహకార పద్ధతిని పెట్టుట శ్రేయోదాయకం. మన రాష్ట్రమునందు గ్రంథాలయ శాసనము ననుసరించి, ఏర్పడిన స్థానిక గ్రంథాలయ సంస్థలవారు ఈ సూచనను పరిశీలించ వలసినదిగా కోరుచున్నాను. దీనివలన చదువరి కోరిన పుస్తకము, ఒక గ్రంథాలయములో లేనిచో మరొక గ్రంథాలయమునుండి తెప్పించి ఇవ్వ నవకాశము కలుగును గదా!

స్త్రీలు, పురుషులు అను భేదము లేకుండ ప్రతివారు ముఖ్యంగా నవలా సాహిత్యమును చదువుచున్నారు: నవలలుసులభశైలిలో వ్రాయబడి యుండి సామాన్య పాఠకునకు సైతము సులభగ్రాహ్య మగుచుండుట వలనను, ఇతర కార్యభారములతో విసిగియున్న వారి మనస్సునకు కొంత ఆహ్లాదమును కలిగించి ఉత్తేజ పరచు చుండుటయే దీనికి ముఖ్య కారణము. అంతియేగాక చాలామంది చదువరుల విద్యార్హతలు ఉన్నత పాఠశాల ఆవరణలు దాటి యుండక పోవుటయు, విద్యావిధానమందలి లోపములు గూడా ఇందుకు కారణములని చెప్పవచ్చును. ఇతర విషయములపై గల ఉత్తమ గ్రంథములలోని విజ్ఞాన విషయములను, ఉత్సాహమును కలిగించు ముఖ్యమైన ఘట్టములను గ్రంథాలయ నిర్వాహకుడు తన వాక్చాతుర్యములో తెలుపుట ద్వారా గ్రంథాలయ పాఠకులను నవలా సాహిత్యమునుండి తదితర గ్రంథములయందు శ్రద్ధను కలిగింపజేసి, చదివించునట్లుచేయ సమర్థుడై యుండవలయును. అంతియేగాని నవలా సాహిత్యమునే ప్రతివారు చదువుచున్నారనియు, అందుచే వాటిని చదువరులకు వారి కోరికల ననుసరించి అందించ జాలకపోవుచున్నామనుట మంచిదికాదు. గ్రంథాలయములోని ప్రతిపుస్తకమునకు ఒక చదువరిని, గ్రంథాలయమునకు వచ్చు ప్రతి చదువరికి ఒక పుస్తకమును ఏర్పాటుచేయుట గ్రంథాలయనిర్వాహకుని విధియైయున్నది. ఇందుకు గాను గ్రంథాలయపు పుస్తకములను విషయమువారిగా విభజించి తయారుచేసిన క్యాటలాగులను అచ్చొత్తించి, కనీసము స్త్రీ సభ్యులకు పంచిపెట్టవలయును. దీనికి యొక్కువ ఖర్చు అగునని ఆలోచించ నవసరము లేదు. అచ్చొత్తించిన క్యాటలాగుప్రతులను ప్రతివారికి అందుబాటులోనుండు రీతిని ధరను నిర్ణయించి, ఆ ధరను చెల్లించిన వారికే వాటిని ఇవ్వవచ్చును. గ్రంథాలయమునకు వచ్చుటకు వీలులేని స్త్రీలు ఈ క్యాటలాగులో తాము చదువదలచుకొనిన పుస్తకములను గుర్తుపెట్టి గ్రంథాలయ నిర్వాహకునికి పంపవలయును. దాని ప్రకారము గ్రంథాలయ నిర్వాహకుడు పుస్తకములను పంపగలడు. చదివిన పుస్తకములను క్యాటలాగులో గుర్తుంచుటద్వారా గ్రంథాలయ నిర్వాహకుడు తిరిగి చదివిన పుస్తకములనే పంపకుండ యుండునట్లు చేయవచ్చును. ఇంకను ఎక్కువమంది సభ్యులు కోరు పుస్తకములను, తక్కువ గడువునే నిర్ణయించి, సభ్యులకు ఇచ్చుటద్వారాను, కోరిన పుస్తకములను సభ్యులనుండి రాగానే గ్రంథాలయమునందే నిలిపియుంచి, ఆ పుస్తకమును కోరిన సభ్యునకు తెలుపుటద్వారాను, సభ్యులకు పుస్తకములందునట్లు చేయవచ్చును. దీనినే 'రిజర్వేషన్' పద్ధతియందురు.

## ప్రచారము

వినోదము ఆకర్షించినంతగా ప్రజలను విజ్ఞానము ఆకర్షించనిమాట వాస్తవము. వినోదము విద్యావంతులను, విద్య లేనివారిని, నాగరికులను, అనాగరికులను, ఒకరి నన నేల ప్రతివారిని ఆకర్షించును. అందువలననే వినోదముద్వారా విజ్ఞానప్రచారము గావించుచున్నారు. చదువరులను ఆకర్షించుటకొఱకే తఱచు వినోద విజ్ఞానప్రదర్శనములను గ్రంథాలయములం దేర్పాటు చేయుదురు. వినోద కార్యక్రమములుగా భావించబడు, సినిమా, నాటకప్రదర్శనములకు జరుగుచున్న ప్రచారములో నూఱవ వంతైనను, గ్రంథాలయములను గురించి జరుగుట లేదు. కావున గ్రంథాలయ ప్రయోజనాన్ని గురించి, అక్షరజ్ఞానము కలిగిన ప్రతివారు గ్రంథాలయములను ఉపయోగించుకోవలసిన అవసరాన్ని గురించి, జీవితములో మానవునకు, దేశానికి వినియోగ పడు విజ్ఞానాన్ని పెంపొందించగల గ్రంథ సముదాయాన్ని గురించి, ప్రచారము చేయ





# స్త్రీలూ, గ్రంథాలయాలూ

కలుగును. దీనికి విద్యాసంస్థలు, గ్రంథాలయసంస్థలు, పత్రికలు, రేడియోలు, సాంఘిక, సాంస్కృతిక సంస్థలు ఎంతేని తోడ్పడగలవు. హరికథలు, పురాణకాలక్షేపములు యేర్పాటుచేయుటద్వారా గూడా ముఖ్యముగా స్త్రీలను యెక్కువగా గ్రంథాలయములకు ఆకర్షించవచ్చును.

స్త్రీలు యెక్కువగా గ్రంథాలయములకు పోజాలరను ఆరోపణగూడ వినవచ్చుచున్నది. కాని యిది వాస్తవముకాదు. సామాన్యముగా గ్రంథాలయాలు ఉదయమునగాని, సాయంత్రమునగాని, తెరచి యుంచబడుచున్నవి. మధ్యతరగతికి చెందిన గృహిణి తన ఇంటిపనులు చేసుకొనే సమయము లివి. కాబట్టి వారి కనువగు సమయము ఏదో తెలిసికొని వీలైనంతవఱకు గ్రంథాలయము పనిచేయు కాలముగూడ నిశ్చయించుకొనుట మంచిది. స్త్రీల కెంత స్వాతంత్ర్యము లభించినను అది సామాన్య గృహిణి దాపునకు చేరలేదనుమాట నిస్సంశయము. అటువంటి పరిస్థితులలో వివేకవంతులైన పురుషులు ఎటువంటి ఆటంకములు కలుగజేయకుండ వారి గృహమందలి స్త్రీలంతా విద్యావంతులై యుండునట్లు, వారు ప్రతినిత్యము దాపునగల గ్రంథాలయాన్ని ఉపయోగించుకొనేటట్లు ప్రోత్సహించవలయును. పురుషునితోబాటు స్త్రీలుగూడ విద్యావంతులైన ఆ గృహములోని బాలబాలికల ప్రాథమికవిద్య పాఠశాలకు వెళ్ళనవసరము లేకయే పూర్తియగును. దేశములోని స్త్రీ పురుషు లందరు గ్రంథాలయాల ద్వారాగాని మరియే యితర విజ్ఞాన ప్రచార సాధనాలద్వారాగాని విజ్ఞానవంతులైనప్పుడే దేశముగూడా సర్వతోముఖాభివృద్ధి చెందగలదు. ★

# కొండమీద కోతి

(35 వ పేజీ తరువాయి)

పాటనేది జరుగనివ్వకూడదు. అలా జరిగింది అంటే పిల్లలూ చెడిపోతారు. మనమూ బాధపడవలసివస్తుంది. పిల్లలు బాగోగులు, పెద్ద చేతుల్లోనే వున్నాయని ప్రతీవాళ్ళూ చెబుతుంటారుకాని ఇలాంటి పొరపాట్లు తెలియకనే చేసేస్తుంటారు. మా ఒక్క కుటుంబంలోనే ఇలాంటి పొరపాట్లెన్నో అలవాటయిపోయాయి. ప్రతివాళ్ళకీ ఇలాటివి ఎన్నో అనుభవాలు, ఎన్నో సందర్భాలలో తటస్థపడుతూ ఉంటాయి. వీటి విషయంలో కొంత శ్రద్ధ చూపించకపోతే బాధపడాల్సొస్తుంది. అందుకే పొరపాటు క్షమింపరానిది అంటారు. ★

# వనితా వాణి

## శోచనీయం

27-11-57 పత్రికలో శ్రీమతి వారణాసి సుబ్బలక్ష్మిగారు వ్రాసిన "తమ్ముడి స్నేహితుడు" అనే వ్యాసంలో వారి ఉద్దేశ్యములు ఏ విధంగాను సమంజసముగా కనపడవు. దొంగతనములు ఈ రోజులలో ఎవరో కొందరు వృత్తిగా పెట్టుకొని బ్రతుకుతున్నమాట వాస్తవమైనప్పటికీ, అందరినీ అంటే స్నేహితులను, చుట్టాలను అకారణముగా నమ్మరాదనుట చాలా శోచనీయము. ఎవరినీ నమ్మకుండా మనముంటే మనని మాత్రం ఎవరు నమ్మతారు? వారికి ఏవిధంగాను లాభము కలుగనప్పటికి ఉపకార బుద్ధితో యున్నటువంటివారు చాలమంది వున్నారు. ప్రతివారిని నమ్మరాదనుటలో కొంచెము సత్యము ఉన్నప్పటికీ, స్త్రీలు ఆలోచనాపరులు గనుక నిదానించి, అర్థం చేసుకుని, ఎదటివారితో మెలగవలసి వుంటుందని కోరుచున్నాను.

కె. ఆర్. రావు (విజయవాడ)

* * *

'తమ్ముడి స్నేహితుడు' లో సుబ్బలక్ష్మిగారు వ్రాసినట్లు ఇప్పుడు అపరిచితులు చాలమంది ఒంటరిగా వున్న ఇండ్లవద్దకెళ్ళి వాళ్ళ ఇంటివారు చెప్పారనో, మీ పెద్దబ్బాయికి చాలా సీరియస్ గా వుంది – మీ నాన్నగారు వెంటనే తీసుకురమ్మన్నారని చెప్పి, చేతికందినంతవరకు లాభంగానో, సొమ్ముగానో సేకరించటం-పలాయనం చిత్తగించటం చాలవరకు పరిపాటై పోయింది. ఈ వ్యాసము వ్రాసిన సుబ్బలక్ష్మి గారికి నా హృదయపూర్వకాభివందనాలు.

ఉల్లగంటి లక్ష్మినరసింహారావు,
(బండ్లమిట్ట, ఒంగోలు.)

* * *

'తమ్ముడి...స్నేహితుడు' అనే వ్యాసం చక్కగా వ్రాసేరు.

అడబాల గీతామణి, మగటపల్లి.

* * *

4-12-57 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో బి. సత్యవతీ దేవిగారు వ్రాసిన పిల్లలూ చదువులు అనే వ్యాసం చాలాబాగా వ్రాసారు. వీరు వ్రాసినది నూటికి నూరుపాళ్ళు నిజం.

కనకల వెంకటేశ్వరరావు,
సామర్లకోట.

* * *

## లోకో భిన్నరుచిః

ఇల్లాంటి ముసలమ్మల కబుర్లకి వనితాలోకంలో స్థానముండుట మాకు ఆశ్చర్యము కలిగిస్తోంది అని రాశారు సోదరి కుమారి లక్ష్మిగారు. భారతదేశము కర్మభూమి అనేమాట మర్చిపట్లున్నారు. ఈ కర్మభూమిలో పుట్టిన ప్రతిస్త్రీ, కుమారిగావున్నప్పుడు శోదసీకుమారంలో విహారం చేసినప్పటికి శ్రీమతికాగానే భర్త, పిల్లలే సర్వస్వమనుకోటము సహజము. అంతకుముందు ఎన్నికబుర్లు చెప్పినా భర్తకి లేక పిల్లలకి కాస్తవక్కలు వచ్చగిలేసరికి ఎన్నో మొక్కులు మొక్కుతుంది. అటువంటివిరాకుండా చెయ్యమని ముందే నోములు వ్రతాలూ చెయ్యటములో తప్పేమిటి? పోనీ బలహీనతే అనుకున్నప్పటికి చావు బ్రతుకులు మానవాధీనాలయ్యేవరకు ఈ భగవదారాధన తప్పదు. ఇంట్లో అమ్మా, అమ్మమ్మ కాస్త ఈ పూట వండవే అంటె వండని అమ్మాయి వనితాలోకంలో వంటలు చూడగానే చేసేందుకు సిద్ధమవుతుంది. అటువంటిపిల్లలు అత్తారిళ్ళకు వెళ్లినా సహాయంగానేవుంటుందా వంటలశీర్షిక. నోములు కూడా అంతే. చిన్నప్పుడు ముసలమ్మల కబుర్లుగా తోచిన అమ్మాయిలు పెళ్ళయి భర్తతో ఏ దూరదేశాలకో వెళ్ళి అకస్మాత్తుగా భగవంతుడు జ్ఞాపకానికి వస్తే మొక్కే విధానము చెప్పే ముసలమ్మలుండరు. అల్లాంటి వారికే ఈ నోములవ్యాసాలు పనికి వస్తాయి. ఇష్టములేనివారు కష్టపడి చదవనవసరములేకుండా మిగతావి చదుకోవచ్చు. నోములోనను ప్రతికథలు [illegible] గానను వైద్యగ్రంథాలా పనుకుంటివి కే, వంటలలోనను అమ్మా, అమ్మమ్మలు ఇల్లా చెప్పకుంటూ పోతే అన్నిటికి అన్నీ వుండనే వున్నాయి. అందుకని ఆ యా శీర్షికలన్నీ వనితాలోకంలో ప్రచురించకూడదనాలేం దేనికి వైద్యగ్రంథాలు పరిస్థితులా అందుబాటులో లేనివని తలచి శీర్షికలలో వనితాలోకం తగినసేవ చేస్తూనేవుంది. కనుక ప్రత్యేకము ఒకశీర్షికను ఎత్తివేసి మూసెయ్యమనటము అన్యాయమే అవుతుంది. లోకో భిన్నరుచిః అన్నారు పెద్దలు.

బి. ఎస్. లక్ష్మి, (కాకినాడ),

* * *

కుమారి లక్ష్మి (కె. బి. సి.)గారు వనితా వాణి శీర్షికలో "నోములు, వుద్యాపనలు, విజోరకంలాంటి కబుర్లు, రాజకుమారుడు, మంత్రికుమారులాంటి కథలు వదయిచేసి "వనితాలోకం"లో వద్దు" అని రాశారు. అయితే ఇప్పుడు వచ్చే సినిమాలన్నీ పురాణాలు, పాతకథలూ కావా? తోచటము లేదని, నలుగురూ చదువుతున్నారు మేము చదువుతున్నాం" అన్న నెపంతో వీరూ చదువుతూంటారు. ఇక పుస్తకాలలో రాయటము మటుకు "స్త్రీలు ఇటువంటి ముసలమ్మ కబుర్లు వినటాడికేగాని లాభము ఉండదు" అని. ఇదే కనుక మగవాళ్ళు అంటె మనం బాధపడతాం. వాళ్లు అనంది పోగా మనమే అంటె ఇది ఏమైనా సబబుగా ఉందా? అందరికి ఉపయోగించేలా ఆచరణలో పెట్టేలా ఉండాలి కాని, "వనితాలోకం" శీర్షికలో ఇటువంటి అసమంజస అభిప్రాయాలు రాసి కాలాన్ని వృథాచేయకుండా, వనితల్ని విసిగించవద్దని నా మనవి.

బి. రామలక్ష్మి (రాజమండ్రి)

* * *

30-10-57 ఆంధ్రపత్రికలో వనితాలోకం శీర్షిక క్రింద బి. ఎస్. లక్ష్మిగారు కార్తీక దీపాలగురించి, వనితావాణిలో కె. ఆర్. లక్ష్మి కేదారీశ్వర వ్రతం గురించి వ్రాసారు. వాటివల్ల వుపయోగం ఏమిటో నాకు తెలియకుండా వుంది. వీళ్లే కాకుండా లోగడ కొందరు కూడా పండగల గురించే వ్రాశారు. నలుగురికీ పనికొచ్చే విషయాలు వ్రాస్తుంటే బాగుంటుంది. పండగలగురించి ఎవరికి తెలీదు? అంతకీ తెలీకపోతే ఇంట్లో వాళ్ళని అడిగి తెలుసుకోవచ్చు. అంతేగాని పుస్తకాల్లో వ్రాయాలా. అట్లా అన్నానని కోపగించుకోవద్దు. మనకి తెలియని ఇతర దేశపువాళ్ళ పండగలగురించి అయితే వాళ్ళ ఆచారాలు తెలుస్తాయిగానీ ఇవి ఎవరికి తెలియవని.

బలభద్రుని వరలక్ష్మి (విజయనగరం)

* * *



# వనితా వాణి



## "హడావుడి రాయుళ్ళు"

'బద్ధకానికి తోడు హడావుడి తోడైతే' మీమాంసుంది అని, ఆ వ్యాసం చదువుతూ వుంటే, మా యింటి యందలి విషయాలు ప్రత్యక్షంగా చూచేవ్రాశారా అనిపించింది. ...మా యింట్లో ఈ హడావుడిరాయుళ్ళ విషయం ఎంతదాకపోయిందంటే: క్రొత్తగా మా అన్నయ్య కుట్టించుకున్నటువంటి మూడు పాతికల రూప్యముల విలువగలిగినటువంటి 'ఫులెన్ పాంట్' ఒకటి, నిర్లక్ష్యంగా ...కాలేజికి పోయే హడావుడిలో ఓమూల త్రొక్కిపోవడంతో మూషిక రాయుళ్ళు దానిని తమ భోజనవస్తువుగా సుపయోగించుకున్నారు...ఆతరువాత మా అన్నయ్య "ఇంత నిర్లక్ష్యంగా పడేసుకోక పోతే కొండుకు తగిలించుకోగూడదూ!......" అంటూ మా వదినను అడేపనిగ అరగంటసేపు మందలించాడు...ఈ 'హడావుడి రాయుళ్ళ' కుంటే జబ్బే ఇదని నాకు చాల అనుమానంగావున్నది...

ఎం. కేశవరావు (గుంటూరు)

* * *

వనిత నిర్మలప్రభావతిగారు వ్రాసిన "బద్ధకానికి హడావుడి తోడైతే" అను వ్యాసం చాలాబావుంది. మావారు ఆవ్యాసం చదివిచిరునవ్వునవ్వుతూవచ్చి 'ఈ ప్రభావతి గారికి కొంపదీసి మనింటిసంగతి తెలీదుగదా' అని పరిహాసంగా అన్నారు. 'కాదు, మీలాంటివారందరకీ అదొక పాఠం' అని వారి తరఫున సుగర్వంగా చెప్పాను.

ములగాడ లక్ష్మి, (రాజమండ్రి)

* * *

మావారు పెళ్ళికి సూటు కుట్టించుకున్నారు. అప్పుడు ఏమి వేసుకున్నారో అంతే. తర్వాత వేసుకోలేదు. ఎవరైనా పెళ్ళి చేసుకొని వూరేగింపుకు ఒకరోజు తీసుకొనిపోయి వాడుకొని తెచ్చి ఇచ్చేవారు. అది ఎక్కడో ఒక దగ్గర నిర్లక్ష్యంగా పడేశేవారు. ప్రెటోల్ వాష్ చేయించమని ఎంత చెప్పినా వినలేదు. అవసరంవచ్చి ఈ మధ్య బయటికితీసి చూసేసరికి చిమ్మటలు కొట్టి పనికిరాకుండా చేసినవి. తర్వాత అయ్యో అని పశ్చాత్తాపం పడటము. ఇలాంటి బద్ధకస్తులు వున్నారంటే ఏమీ ఆశ్చర్యంగా వుండదు. తీరిక లేకుండా పని అయినావుంటే అనుకోవాలి అదీలేదు.

టి. రమాదేవి (మార్కాపురం)

* * *

ఈ వ్యాసముచదువుతుంటే నాకు చాలా ఆనందముకలిగినది.

కలవల వరదరావు, (హైద్రాబాదు.

మహిళాభ్యుదయంగురించి 6-11-57 తేదీ పత్రికలో వ్రాసినది చదివాను. చాలా బాగున్నది: ప్రతీ జిల్లాలో జిల్లాస్థాయి శరణాలయాలు నెలకొల్పడం ఎంతేనా అవుసరం. ఎంతమంది స్త్రీలో ఆదరించేదిక్కులేక నానాఅగచాట్లుపడి పతనంచెందుతున్నారు. అటువంటి స్త్రీలకు ఈ శరణాలయాలు చాలా ఉపయోగించుతాయి.

మంగు సుభద్రాదేవి (శ్రీకాకుళం)

* * *

## "మరొకకారణం"

ఆత్మ హత్యలు వ్యాసం చాల బాగుంది. ప్రస్తుతము జరుగుతున్న వే ఉన్నదున్నట్లుగా వ్రాశారు. ఈరోజుల్లో కట్నాలు ఇవ్వలేని కారణంగా కూడ ఎంతోమంది పెండ్లికాని యువతులు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. మధ్య తరగతి సంసారములలోని ఆపిల్లలపని మరీ శోచనీయంగావుంది. తమకై తలితండ్రులు పడేబాధ పైగా ఇరుగుపొరుగువారి సూటీ, పోటీలు, ఇవన్నీ చూస్తూ మన వల్లనేకదా తలిదండ్రులకు ఇన్ని బాధలు అన్న క్షోభతో మరణమే మంచిదనే అభిప్రాయం కలుగుతోంది చాలామంది ఆడపిల్లలకి. ఈ కట్నపిశాచికూడ ఆడవాళ్ళ ఆత్మహత్యలకు మరొక కారణం అవుతున్నది. రమణమ్మగారు వ్రాసినటువంటి వ్యాసములు చదివి వందువల్లనైనా కొంతవరకు ఆడవాళ్ళలో ఈ ప్రమాదాలు జరుగవని ఆశిద్దాం.

ఎ. లలిత. (వేటపాలెం)

* * *

పురుషులకు నీచపరుస్తు వ్రాశారు, కేవలం పురుషులలోనే కాకుండ స్త్రీలలో కూడ లోటుపాటు లేనిదే ఏ కలహం ఏ లోపం రాదని గ్రహింతురుగాక.

ఎం. బషీర్ (కైకలూరు)

* * *

"ఆత్మ హత్యలు ఆడవాళ్ళలో ఎందుకు ఎక్కువ" అనే వ్యాసంలో మూడవ సందర్భములో ఆత్మహత్యలగురించివ్రాస్తు మగవారి మనస్తత్వములమీద చాలా తీవ్రంగా విమర్శించారు. "భార్యను ప్రేమగా ఆప్యాయంగా చూచే వారెందరులేరు అనే ప్రశ్న రావచ్చు" అని అంటు సినిమాలలో, కథలలోనే అని వ్రాసినారు. భార్యలమూలంగా భర్తలు ఇల్లు విడచిన సందర్భములుకూడా చూస్తూ ఉన్నాము. లోకంలో (పురుషులలోను, స్త్రీలలోను) అందరు ఒకే మాదిరి ఉండరు. కనుక ఒక పురుషుల మనస్సుల గురించి ఇంత కఠినముగా విమర్శించరని తలుస్తాను.

వై. ఆర్. రాజా (చిలకలూరిపేట)

* * *

మా నాన్నగారి స్నేహితుడు ఒకాయన రెంగాలి ఉన్నారు. అతను పెద్ద కుమార్తెను పెళ్లి చేయకుండా, రెండవ కుమార్తెను పెళ్లి చేసేరు. అందుచేత పెద్దమ్మాయి ఉరిపోసుకు చనిపోయింది. పెద్దమ్మాయికి పెళ్ళి చేయని కారణం ఆమె అందవిహీనురాలు. ఎవరు చేసుకొనేందుకు ముందుకురాలేదు. అతి స్వల్పవిషయానికి ఆమె ఆత్మహత్య చేసుకొంది.

బి. సుగుణమణి, రెంగాలి (ఒరిస్సా)

* * *

## బాధ్యులు ఎవరు?

"ఆత్మ హత్యలు ఆడవాళ్ళలోనే ఎందుకు ఎక్కువ అనే వ్యాసాన్ని చాలా బాగుగా వ్రాసినారు. రమణమ్మగారికి నానమస్కారములుగూడా. ఈ కాలములో ఎంతోమంది పడుచులు ఎక్కువగా ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. దీనికి కారణము స్త్రీలే. పురుషులు ఏమాత్రముకాదు. ఆడదానికి ఒక్కసారి శీలముచెడితే తన గతి ఏమవుతుంది అని ఆమె ప్రశ్నించుకోవాలి. రమణమ్మగారు మగవాళ్ళను దూషించుతూ వ్రాసినారు. అది చాలా తప్పు. ఒక పురుషుని ప్రేమించి, నమ్మించి ద్రోహముచేసిన స్త్రీలు ఎందరు లేరు! ఈలాంటి సందర్భాలు అనేకమున్నాయి. పాపం ఆ మొగవాడు పిచ్చి ఎత్తి ఆఖరికి తన జీవితాన్ని కోల్పోతాడు. దానికి ఎవరు బాధ్యులు. స్త్రీయా కాదా?

చింతలపాటి హరివిఠల్ రావు,
మద్రాసు 1.

* * *

## ఓర్పులేక

పురుషులలో ఉన్నంత ఓర్పు, సహనము, దూరాలోచన స్త్రీలలో లేకపోవుటే యిందులకు కారణము ముఖ్యముగా స్త్రీలలో ఓర్పు యుండాలి.

ఫాతియాసుల్తానా. (కాకినాడ.)

* * *

### సవరణ

గతవారం లో పై పు కవరుపేజీలలో 'విశ్రాంతి' ఫోటో తీసినవారు ఎస్. కె. విఠల్, 'నీటిలో ఆట' ఫోటో తీసినవారు పి. వి. నారాయణ అని గుర్తించ ప్రార్థన.




'కర్ణు డంత గొప్పదాత,
కనిపింపడు వేఱొక్కఁడు''
అనెడి కీర్తి విన్నాఁడా
దుర్యోధన చక్రవర్తి.
అగ్గిబోలు అసూయతో
బుగ్గి యగుచు నాతడు
కర్ణుని మించిన దాతను
కావలె నని తలచినాడు.
'దుర్యోధనుడంత దాత
ధరణి లేడు' అను కీర్తిని
సంపాదించాలంచును
సమకట్టెను చక్రవర్తి.
అడిగి అడుగకుండగానె
అందించెను దానముగా,
అన్నవస్త్ర ధన ధాన్యము
లెన్న లేని సంఖ్యలలో.
దుర్యోధన రాజు కూడ
దాన కర్ణుడాయెనని
మహిమీదను మంచిపేరు
మెలమెల్లగ వ్యాపించెను.
'కర్ణు డెంత నా ముందర?
కల డెవ్వడు నన్ను మీర?'
అనుకొంచును గర్వపడెను
అప్పటినుండియె రాజు.
వర్షాకాలము వచ్చెను,
వరదలు, వంకలు హెచ్చెను,
హోరుహోరుమంచు వాన
జోరుకు ఎడతెరపి లేదు.

రాజు గర్వమణచుటకును,
రవిపుత్రుని ఘనత జూప
రయమున బ్రాహ్మణు డొక్కఁడు
రాజు జేరి యిట్లనియెను:
"దుర్యోధన రాజచంద్ర!
దానధర్మ గుణసాంద్ర!
యజ్ఞము చేయంగదలచి
అరుదెంచితి మీ దయకై."

## సహజగుణము

### కవిరు

ఎక్కువ నే గోరలేదు
యిప్పింపుడు రెండు బండ్ల
ఎండిన కాష్ఠంబు లిపుడు,
యిలలో మీ సాటిలేదు.
"హేహేహే బ్రాహ్మణుడా!
ఎంత వెఱ్ఱివాడవయా?
వానకాల మిదె వచ్చెను,
ఏ లెట్లగు యజ్ఞమునకు?
ఎండుకట్టె లిపు డెక్కడ?
ఎందుల కీ పిచ్చికోర్కె?
కోరుకొనుము వలసినంత
కోట్ల ధనము నీ కిచ్చెద."
అని పలుకగ రాజుగారు
'అవసర వస్తువు నియ్యరు-
ధన మెందుకు నాకొ'టంచు
తరలిపోయె బ్రాహ్మణుండు.

ఆ దినమే రాచవీధి
నా బ్రాహ్మడు నాల్గుబండ్ల
కట్టెల గొంపోవుచుండ
కురురా జడిగెను వివరము.
అందుల కా బ్రాహ్మణుండు
"అయ్యా! ఓ దానమూర్తి!
మిమ్మడిగిన లేదంటిరి,
మమ్మె ఎగతాళిచేసి.
కాదనకుండా కోరిక
లేదనకుండా కట్టెలు
కర్ణుడు ఆ గొప్పదాత
కనికరించి యిచ్చినాడు.
ఎండుకట్టె లేనందున
రెండిండ్లను కూలద్రోసి
త్రావులు వాసములు జేర్చి
తగు రీతిగ దాన మిచ్చె.
ఆ మాటలు వినగానే
ఆ దుర్యోధన జనపతి
తనకు తాను సిగ్గుపడుచు
తలవంచెను మౌనముగా.
'సహజ గుణము లేకున్నచో
సత్కీర్తికి పాత్రు డగునె?
కృత్రిమముగ మానవుండు
కులుక నెంచుచుండుగాని!
నంది కాశికేగగానె
బలిసి గజము ఐపోవునె?
అంతేగా మానవుడును!"
అనుచు గర్వముడిగె రాజు.

★

# తారు మారు

మద్రాసు వెళ్ళే బండి గూడూరు ప్లాట్‌ఫారంమీద అప్పుడే ఆగింది. దిగే ప్రయాణీకులతోనూ, ఎక్కే ప్రయాణీకులతోనూ స్టేషను కోలాహలంగా వుంది. పేపరు కుర్రాళ్ల కేకలూ, కూల్‌డ్రింక్సు వాళ్ల అరుపులూ అంతటా ప్రతిధ్వనిస్తున్నాయి.

సెకండ్ క్లాసు పెట్టె వెతుక్కుంటూ హడావుడిగా వస్తున్న పరాంకుశం, రైల్లోకి ఎక్కడమెలాగా అని ఆలోచిస్తున్న సుబ్బారావుని చూసి తటాలున ఆగిపోయాడు. క్షణం ఆలోచనలో పడిపోయాడు పరాంకుశం—

"చిన్నతనంలో చదువుకునేప్పుడు సుబ్బారావువాళ్లు చాలా ధనికులు. వాళ్ల నాన్న నూలు వ్యాపారస్తుడు. తనకిగూడా వాళ్ల అమ్మ ఎన్నోసార్లు డబ్బులిచ్చేది. అలాంటివాడు ఇప్పుడీముతక బట్టలతో మూడోతరగతిపెట్టె నెక్కేందుకు ప్రయత్నిస్తున్నాడేమిటి?... బహుశా వాళ్ళనాన్నకు వ్యాపారంలో నష్టమొచ్చివుండొచ్చు. అప్పు ఎక్కువచేసి ఆస్తంతా పోగొట్టుకొని వుండవచ్చు! పాపం." ఇలాగే సాగిపోతున్నాయి పరాంకుశం ఆలోచనలు.

వెంటనే తను కొన్న సెకండ్ క్లాసు టిక్కెట్టు విషయం జ్ఞాపకమొచ్చింది—"ఇప్పుడు తనూ

**ఆర్. వి. జి. కృష్ణమూర్తి**

మూడోతరగతి టిక్కెట్టు కొంటే హాయిగా మద్రాసువరకూ సుబ్బారావుతో మాట్లాడుకుంటూ వెళ్లొచ్చు" అనుకుని పరాంకుశం చరచరా వెళ్ళి తన టిక్కెట్టు మార్చుకుని మూడోతరగతి టిక్కెట్టు తీసుకొచ్చాడు.

సరిగ్గా అదేసమయానికి సుబ్బారావుదృష్టి పరాంకుశంపై పడింది. "అరే ఏడేమిటీ-ఈ ట్వీడ్ సూట్లేమిటీ — బాగా సంపాయించినట్టున్నాడే వీళ్ళనాన్న! పాపం. చిన్నప్పుడు వీళ్ల కుటుంబం ఎన్నో బాధలు పడేది. ఇప్పుడు యింత దర్జాగా వున్నాడు. వీడు తప్పకుండా సెకండ్ క్లాస్‌లోనే ప్రయాణంచేస్తాడు. డబ్బు పోతేపోయింది. నేనూ సెకండ్ క్లాస్ టిక్కెట్‌కు మార్పించుకుంటే బాల్యస్నేహితుడితో మద్రాసు వరకూ కబుర్లు చెబుతూపోవచ్చు" అనుకుని సుబ్బారావు త్వరగావెళ్లి తన టిక్కెట్టు మార్చి సెకండ్ క్లాస్‌టిక్కెట్టు కొనుక్కొచ్చాడు.

రైలు గంట కొట్టారు. గార్డు విజిల్‌వూది పచ్చజండా విసిరాడు. ఇంజను కూతేసింది. సుబ్బారావు త్వరగా పరుగత్తి సెకండ్ క్లాస్ పెట్టెనెక్కి తలుపుదగ్గర నిలబడి బయటికి చూచాడు. ప్రక్కనే వున్న మూడోతరగతి పెట్టెలోంచి పరాంకుశం చెయ్యి విసరడం గమనించిన సుబ్బారావు "వీడి పద్ధతి పైన పటారమేగాని లోన లొటారంగా వున్నట్లుంది. వేషాడంబరమేగాని అసలు సరుకున్నట్లులేదు," అనుకున్నాడు మనసులో.

మూడో తరగతి పెట్టెలోని పరాంకుశం "వీడు ఆస్తిపాస్తులున్నా వెధవ ముతకబట్టలే కట్టేంతటి పిసినారయ్యాడన్నమాట. అంత మురికి బట్టలతో సెకండ్ క్లాస్ ఎక్కడమెందుకో అనుకున్నాడు.

రైలు బండి ఎవరిగోడవల్నీ పట్టించుకోకుండా 'రయ్' మని పోతోంది.






సచిత్ర వారపత్రిక



# సంక్రాంతి ప్రత్యేక సంచిక

**[15-1-1958]**



ప్రధానాకర్షణ

## సినిమా శీర్షిక

చలనచిత్ర కళకు, పరిశ్రమకు సంబంధించిన

ప్రత్యేక వ్యాసాలు — చిత్రాలు



రసవంతమైన కథలు, గేయాలు

రమణీయమైన చిత్రాలు, ఫొటోలు



"వనితాలోకం" శీర్షికలో

ప్రత్యేక వ్యాసాలు — చిత్రాలు



ముగ్గులు — డిజైన్లు

రచనలు, చిత్రాలు అన్నిటిపైనా "సంక్రాంతి సంచికకు" అని వ్రాయాలి.



**1957 డిసెంబరు 18 లోగానే మాకు చేరాలి.**

# బ్రహ్మరాత

నారదమహర్షి పేరు అందరూ వినే వుంటారు. అతను బ్రహ్మదేవుడి కొడుకు, ఎప్పుడూ భగవంతుడిమీద పాటలు పాడుతూ ఆ లోకం, ఈ లోకం తిరుగుతూ వుంటాడు. అవకాశం ఏదన్నా దొరికితే వాళ్లకూ వీళ్లకూ ఏదో తగువు పెట్టి తను ప్రక్కన వుండి తమాషా చూస్తాడు. అందుకనే అతన్ని 'కలహప్రియుడు' అని కూడా అంటారు. పైగా నారద మహాముని, చాలా తెలివైనవాడు. అతనికి సంగీత సాహిత్యాల్లో కూడా ప్రవేశం వున్నది!

సరే, ఒకనాడు నారదుడు ఏదో పాట పాడుకుంటూ అరణ్యమార్గాన పోతున్నాడు. అతనికి శ్మశానం కనిపించింది. శ్మశానాన్ని దాటుకుంటూ పోతూవుంటే అతని కాలికి ఏదో తగిలింది. ఏమిటా అని చూశాడు నారదుడు. ఒక మనిషి పుర్రె అది! దాని సంగతేమిటో నని చేత్తో తీశాడు, నారదుడికి బ్రహ్మరాత తెలుసును. వెంటనే దాని నుదుటిమీద ఏం రాసివున్నదో నని చదివాడు. "ఈ మనిషికి గొప్ప యోగంపడుతుంది. అది సాధారణ మానవులకు ఎవరికీపట్టని మహాయోగం!" అని వున్నది. చదవగానే నారదుడికి ఒక్కసారి ఒళ్లు గగుర్పొడిచింది. తను చదివింది తప్పో, ఒప్పోనని మళ్లీ చదివాడు. నిజమే! అదే రాసివున్నది. ఐతే ఈ బ్రహ్మ ఏదో తప్పటడుగు వేశాడన్నమాట! కాకుంటే 'ఎవరికీ పట్టని మహాయోగం' గల ఈపుర్రె ఈ శ్మశానంలో ఇట్లా దొర్లటం ఏమిటి? నారదుడు అది చూసి నవ్వుకున్నాడు. ఈ నాటికి ఈబ్రహ్మరాత ఇట్లా అడ్డుతిరిగిందన్నమాట! కానీ చూతాం! తన రాతకు అడ్డు లేదని బ్రహ్మకు ఎంత గర్వం? ఆ రాత ఎవరికీ తెలియకుండా అట్లా రాస్తే ఎవడూ చదవలేడనుకున్నాడు పాపం!

**సుకుమార్**

ఇట్లా ఆలోచిస్తూనే నారదుడు ఆ పుర్రెను తీసుకుని బ్రహ్మలోకానికి పోయాడు. బ్రహ్మదేవుడు ముందు పుట్టబోయేవారి రాతలన్నీ చూసుకుంటున్నాడు.

"నమస్కారం తండ్రీ! మీరాతలు ఇక ఆపటం మంచిదనుకుంటాను!" అన్నాడునారదుడు లోపలకుపోతూ.

బ్రహ్మకు ఆశ్చర్యం వేసింది.

"ఏమిటి నువ్వంటున్నది?" అన్నాడు నారదుణ్ణి.

"అవాఁ! మీరు రాసే రాతలకు అడ్డువుండదనేగా మీ నమ్మకం?"

"అవును. అందులో ఏ మాత్రం లోపం వుండదు!" అన్నాడు బ్రహ్మ.

"ఐతే చూడండి — ఈ పుర్రె మీద ఏం రాశారు? ఈ మనిషికి మహాయోగం పడుతుందనికాదూ? అంత మహాయోగం పట్టేవాడి పుర్రె ఎప్పుడూ శ్మశానంలో దొర్లదు. ఈపాటికి ఇది ఏ గంగా నదిలోనో, త్రివేణీ సంగమంలోనో కలపబడి వుండవలసింది!" అన్నాడు నారదుడు.

ఈ మాటకి బ్రహ్మదేవుడు కొద్దిగా నవ్వి—

"నిజమే నారదా! దానికి మహాయోగం పట్టింది" అన్నాడు.

"ఏమిటది? ఇంకా మీ మాట పట్టుకుని ఎందుకట్లా ఇదవుతారు?" అన్నాడు నారదుడు వుక్రోషంగా.

"చెబుతావిను" అని,

"నారదా! సామాన్యమైన పుర్రే ఐతే, అది నీ చేతిలో ఎందుకు పడుతుందంటావ్?" అనడిగాడు బ్రహ్మ. నారదుడు ఈ మాటతో అయోమయంగా చూశాడు.

"ఆ పుర్రెకు మంచి యోగం వుండటంచేతే అది నీచేతిలో పడ్డది. పైగా, ఇంతవరకూ ఏ పుర్రెకూడా మానవలోకంనుంచి బ్రహ్మలోకానికి రాలేదు. ఇది, నీ చేతిలోపడి, నీ ద్వారానే బ్రహ్మలోకం కూడా చేరింది. ఇంతకంటె ఏంకావాలి? ఇది ఇది మహాయోగం కాదంటావా నారదా!" అన్నాడు నవ్వుతూ బ్రహ్మ.

నారదుడికి నోట మాట రాలేదు. అనుకోకుండా చేతిలోంచి ఆ పుర్రె జారిపోయింది-ఐతే క్రిందపడిపోలేదు. అది నారదుడి వొళ్లోనే పడింది! ★

# ఉస్మానియా విద్యార్థుల ఆంధ్రాభ్యుదయోత్సవాలు

(31-వ పేజీ తరువాయి)

తమ శక్తి సామర్థ్యాలను ధారపోస్తారు. కాని,—

ఆంధ్రాభ్యుదయోత్సవాల కోసం జరిపే పోటీలలో ఆంధ్రేతరుల వక్తృత్వ పోటీ ఒకటి. తెలుగు మాతృభాష కాని కళాశాల విద్యార్థులలో వక్తృత్వంలో ఎవరు మేటి? అన్నది ఒక పోటీ. హైదరాబాదు నగరం బహుభాషానగరం కాబట్టి తెలుగు మాతృభాష కాని విద్యార్థులుచాలమందిఉంటారు. తెలుగు ఉపన్యాసాలను సిద్ధం చేసుకొని, కన్నడంలోనో, మరాఠీలోనో, ఉర్దూలోనో రాసుకొని, కంఠతా పెట్టి గడగడా చదివేస్తారు! తెలుగు విద్యార్థులు సామెతలు చెప్పలేమో కాని, ఈ విద్యార్థులు తమ తెలుగు ఉపన్యాసాలలో చెప్పే లోకోక్తులకు లెక్కలేదు. ఎలక తోక తెచ్చి ఎన్నాళ్ళో ఉతకడం దగ్గర ప్రారంభించి, కుక్కతోక వంకరగా ఉండడం వరకూ కన్నడ కంఠంతోనో, ఉర్దూ ఉచ్చారణతోనో ఉపన్యసిస్తారు.

ఒకానొకసారి ఈ దురదృష్టవంతుడు-(అదృష్టవంతుడు అనాలి కాబోలు!) ఈ ఆంధ్రేతరుల వక్తృత్వపోటీకి న్యాయమూర్తులలో ఒకడుగా నియమించబడ్డాడు. పోటీదారులు ఎక్కువైనా తక్కువైనా, ప్రేక్షకుల సంఖ్య పెద్దదైనా, చిన్నదైనా-న్యాయమూర్తులే అందరికంటెతక్కువుంటారనేభావం లోకంలో ఇదివరకేఉంది: మాకూ ఉంది. మేముముగ్గురంనిష్పక్షపాతంగామొహాలుఅమర్చుకు సిద్ధంగా కూచున్నాం. మాకు నిర్వాహకులు టిఫిన్ ఖిలాయించి, చాయ్ పిలాయించారు. నిర్వాహకులు — కార్యదర్శులు, తదితరులు — అందరూ ప్రేక్షకులయ్యారు. ఒక విద్యార్థి ప్రత్యక్షమై కాయితం చేత్తోపట్టుకొని సగం ఉపన్యాసం చెప్పి, మిగతాది కాయితంలో ఉన్నది చదివేశాడు. న్యాయమూర్తులం ముగ్గురం కూడ పలుకొక్కని కళ్ళుమూసుకొన్నాం (సాధారణంగా చెవులు మూసుకోడం ఆచారంట!) తరువాత వైద్యకళాశాల విద్యార్థిని ఒకామె వచ్చి సగం ఉపన్యాసంఇచ్చి, ఒక్కక్షణం బల్లలవైపు, గోడవైపు, గోడమీది గడియారంవైపుచూసి, ఒక నవ్వునవ్వేసి వెళ్ళిపోయింది. మూడవ అభ్యర్థి ఉన్నాడటగాని చివరినిముషంలో 'నయ్ఆతే!' అన్నాడట. బహుమానాలు రెండు. ఎవరికిచ్చామో వేరే చెప్పక్కర్లేదు!



ప్రతిసంవత్సరం ఈ ఆంధ్రేతరుల వక్తృత్వపోటీలు వక్తలులేక బాధపడతాయనికాదు. ఆ సంవత్సరం అది మా దురదృష్టం. (అదృష్టంకూడా: ఎందుచేతనంటే న్యాయవిచారణ చాలాసులభమయిపోయింది) ఇందువల్ల పోటీలలో విజయం అభ్యర్థుల అర్హతనుకాక, ఉన్నవారిలో అర్హులన్న సంగతిని సూచిస్తుంది. ఫలితాల విలువలను పెంచాలంటే, పోటీప్రమాణాన్ని హెచ్చించాలి. ఆంధ్రాభ్యుదయోత్సవాల పోటీలలో బహుమానం పొందడం ఉద్యోగాలకు ఒక ప్రత్యేకార్హతగా గమనించదగినంత స్థాయికి ఈ పోటీలను తీసుకురావాలి!

విద్యార్థులు ఉత్సాహపరులు; నిర్మాణాత్మకమైన కార్యక్రమాలకూ, ఇటువంటి వాటికీ వారు పూనుకొన్నప్పుడు, కొత్త కొత్త భావాలతో పోటీలను జరపడానికి వారు సంసిద్ధులైనప్పుడు, ఈ ఉత్సాహాన్ని, ఈ పూనికని, ఈ సంసిద్ధతని సర్వవిద్యార్థి జనాభ్యుదయానికి వినియోగించుకోవలసిన బాధ్యత అధ్యాపకవర్గంపై నున్నది.

## ఎనిమిదేళ్ల చరిత్ర

నాకు తెలిసినంతవరకు హైదరాబాదులో ఈ అభ్యుదయోత్సవాలు 1949 సం॥ లో ప్రారంభమయ్యాయి. డా॥ మారేమండ రామారావు అధ్వర్యంక్రింద ఆ సంవత్సరం నిజాం కళాశాల విద్యార్థులు జరిపారు. మరు సంవత్సరం రామరాజు, డా॥ సుబ్బారావు ప్రభృతుల ప్రోత్సాహంపై ఏడు కళాశాలల తెలుగు విద్యార్థులు ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆవరణంలో ఈ ఉత్సవాలను జరుపుకొన్నారు. 'ఇంతింతై, వటుడింతయై' అన్నట్లు, ఏడు పదిహేడై, రెండు మూడు సంవత్సరాలలో ఇరవై ఏడై, ఈ సంవత్సరం ముప్పైఒక్క కళాశాలల విద్యార్థులు ఈ ఉత్సవాలలో పాల్గొంటున్నారు! 1955 లో ఈ ఉత్సవాలు వెంకట్రామురెడ్డి మహిళాకళాశాలలో జరిగాయి. మిగిలినవన్నీ నిజాం కళాశాల ఆవరణలోనే జరిగాయి : జరుగుతున్నాయి.

'ఆగేబఢో' అంటే ముందుకుపోవడమే. కాని ముందంటే ఏది అన్నది అన్నిటికంటె ముందే నిశ్చయించుకోవాలి. ప్రపంచంలో అందరూ—ముఖ్యంగా విద్యార్థులు—ఎల్లప్పుడూ అభ్యుదయకాములే. అభ్యుదయకామిగానివాడు మోక్షకామి కాలేడు. "మన ప్రాచీన సారస్వతం అధమాధమం; పదండి ముందుకు, పదండి తోసుకు, పోదాం పోదాం పైపైకి" అనేవాడు అభ్యుదయకామి! "అధునాతన సారస్వతం అథమాధమం. విలువలు జగన్నాథరథచక్రాలక్రింద పడి అణగారిపోతున్నాయి! మనం తిరిగి ప్రాచీనుల స్థాయిని అందుకోవాలి!" అనేవాడు కూడా అభ్యుదయాన్ని వాంఛించేవాడే!

అలనాడు హైదరాబాదు ఉర్దూ వాతావరణంలో ఊపిరాడక కొట్టుకొంటున్న రోజుల్లో, విద్యార్థులలోని తెలుగుదనాన్ని లేకెత్తించడానికి ఉద్దేశించబడ్డాయి ఈ ఉత్సవాలు! అభ్యుదయోత్సవాలు అని నామకరణం చేశారు. ఈనాడు హైదరాబాదు తెలుగులది. ఇది తెలుగునగరం; తెలుగువారి రాజధాని—అభ్యుదయాన్ని వాంఛించే అభ్యుదయమేదో స్పష్టంగా నిర్వచించుకోవాలి.

ఇన్ని సంవత్సరాలుగా జరుగుతున్న పోటీలలో ఫలితాలకి కళాశాల బయటికి పోతే ఎంత విలువ ఉంది? ఇన్నేళ్ళుగా, ఏ ఏటికి ఆ ఏడు ఒకే చోట పన్నెండు పదహారు నాటికలను ప్రదర్శిస్తున్న ఈ ఉత్సవ నిర్వాహకులకు శాశ్వతంగా ఉపయోగపడే రంగస్థలం ఒకటి ఉందా? అభ్యుదయోత్సవాలకై ప్రత్యేకంగా నాటికలను రచించారనే ఉత్సాహం రచయితలెవరైనా ప్రదర్శిస్తున్నారా? రచయితల నాటికలను విజయవంతంగా ప్రదర్శించే విద్యార్థులు, బహుమతి ప్రదాన సమయంలో అజ్ఞాతుడైన రచయితకి అథమం మాటలతోనైనా కృతజ్ఞతలు చెప్పుకొంటున్నారా?

ఇవి కొన్ని ప్రశ్నలు. ప్రశ్నలు చాలా ఉన్నాయి. ప్రశ్నలు వేయడం పెద్దలవంతు; సమాధానం చెప్పడం విద్యార్థులది. వారు సమాధానంకోసం వెదుకగలరుకూడా! వారికా శక్తి ప్రపత్తులున్నాయి. ఉత్సాహం వుంది!

సమధికోత్సాహంతో ఆంధ్రాభ్యుదయోత్సవ నిర్వహణకు పూనుకొన్న ఉస్మానియా తెలుగు విద్యార్థిగణానికి 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' తరఫున ఇవే హృదయపూర్వక అభివందనలు.



# సినిమా

## బొంబాయి సినిమా లేఖ

బొంబాయి ఫిలిం ప్రపంచంలో అందరూ 'అనార్కలీ' అని పిలుచుకునే తార బీనారాయ్, మళ్ళీ, కొన్నాళ్ళపాటు చలన చిత్రాలనుండి వైదొలగి విశ్రాంతి తీసుకోబోతోంది. ఈసారి, భర్త ప్రేమనాథ్‌కు కూతుర్ని అందిస్తుందని బంధుమిత్రులు అంటున్నారు. ప్రేమనాథ్ దంపతులకు ఇపుడు ఒక్క కొడుకు: ప్రేమనాథ్ జూనియర్.

కొంతకాలంపాటు తెరమరుగున ఉండిపోయిన ప్రేమనాథ్ ఇపుడు మళ్ళీ పుంజుకుని పది చిత్రాలలో బుక్ అయ్యాడు. వాటిలో ఒకదాంట్లో అతని నాయిక మీనాకుమారి, మరో చిత్రంలో నళినీ జయవంత్.

కాంట్రాక్టులసంఖ్య తగ్గిపోతున్న తారలు సూరయా, ఉషాకిరణ్. కొన్నాళ్ళ క్రితం సూరయా నివసించే భవంతిలో ఒక హత్య జరగడం, అది కోర్టుకెక్కి విచారణ జరిగిన తరువాత ఆమె పినతండ్రికి శిక్షపడడం విదితమే. సురయా ఇప్పుడు రెండు చిత్రాలలో నటిస్తూంది.

శక్తి సామర్థ్యాలు, ఉత్సాహం పుష్కలంగా ఉన్నా అట్టే చిత్రాలు లేకుండా ఉన్న మరో నటి ఉషాకిరణ్. ఉత్సాహం లాగే, శరీరం కూడా భారీగా ఉండడమే కారణమని కొందరు నిర్మాతలు అన్నారు. ఒకప్పుడు ఆమెను బుక్ చేయాలనుకున్న వారు కూడా, ఆమెను చూచినమీదట, కథలో పాత్రకు అంతగా నప్పదన్న అభిప్రాయంతో ఆ ఊహ వదులుకొంటున్నారు.

అగ్రశ్రేణి నటీనటులు మటుకు ఎప్పటి లాగానే, ఉచ్చస్థాయిలో ఉన్నారు. నర్గీస్ నాలుగు పెద్ద చిత్రాలలో నటిస్తూంది. ఇవి కాగానే, మరో నాలుగు ఆరంభం అవుతాయి. రాబోయే చిత్రాలలో నర్గీస్ నటించినవి: అదాలత్, లాజ్‌వంతి, ఏక్ థా రాజా - ఏక్ థీ రాణీ.

దిలీప్‌కుమార్ కూడా నాలుగు పెద్దచిత్రాలలో ఇపుడు నటిస్తున్నాడు. మొగల్-ఇ-అజాం, కోహినూర్, మధుమతి, యహూదీ. ఇవికాక, అతని సోదరుడు నసీర్ ఖాన్ తీసే చిత్రంలోనూ, మహబూబ్ తరువాతి చిత్రంలోనూకూడా పాల్గొనబోతున్నాడు. మహబూబ్, తన కొత్తచిత్రానికి నర్గీస్‌ను బుక్ చేయాలని సంకల్పించారు.

ఇతర నటులలో దేవానంద్ నటిస్తున్నవి ఆరు: అమర్‌దీప్, మంజిల్, కాలీరాణి, సోలాంకారాజా, సాల్వాసాల్, కాలాపానీ. ఇవికాగానే, ఆరంభించేందుకు మరో ఆరు సిద్ధంగా ఉన్నాయి. దేవానంద్, 'అమర్‌దీప్' షూటింగ్‌లో పాల్గొనడానికై నవంబరు 18న మద్రాసువెళ్ళి మొన్ననే తిరిగివచ్చాడు. శివాజీ గణేశన్ నిర్మిస్తున్న ఆ చిత్రంలో ఇతని నాయికలు వైజయంతిమాల, పద్మిని. ఆగా, ముక్రీ, రాగిణికూడా పాల్గొంటున్నారు. సంగీతం సి. రామచంద్ర. దర్శకుడు తాతినేని ప్రకాశరావు. దేవానంద్ మద్రాసు తారలతో నటించడానికిదే తొలిసారి. ఏడాదినాడు, అతడు తన స్వంతకంపెనీ నవకేతన పిక్చర్స్ పేరిట తలపెట్టిన చిత్రానికి వైజయంతిమాలను బుక్ చేశాడట. తీరా అది మొదలయే వేళకు, ఆమె రుసుము స్థాయి పెరిగిపోయింది. ఆ విషయమై ఏర్పడ్డ సమస్య తేలక, దేవానంద్ ఆ చిత్రం మానుకున్నాడట.

## విద్యార్థులా, సినిమాలా

ఉత్తర ప్రదేశ్‌లో చలనచిత్ర ప్రదర్శన వేళలలో మార్పులేమైనా చేయడం అవసరమా అన్న విషయం పరిశీలించడానికి, రాష్ట్ర ప్రభుత్వం, ఎక్సైజుమంత్రి డా॥ సీతారాం అధ్యక్షతన ఒక సంఘాన్ని నెలకొల్పింది. విద్యార్థులు ముఖ్యంగా ఏ వేళలలో సినిమాకి వెళ్తున్నారు. ఏ తరహా చిత్రాలు ఎక్కువగా చూస్తున్నారు అనేది ఆరా తీస్తారట. ప్రస్తుతం రోజూ మధ్యాహ్నం రెండుమండి రాత్రి పన్నెండు వరకు ఆటలు ఉంటున్నారు. ఆ పైన ప్రదర్శనకు అనుమతి తెచ్చుకోవాలి. ఇపుడు, ఈ మధ్యాహ్నపు ఆటలు విద్యార్థుల్ని బడికీ, కాలేజీకీ, వెళ్లొద్దని పలహోయిస్తున్నాయా, అన్న సంగతిని ఈ సంఘం కనుక్కుంటుందట. ఎంతమంది 'క్లాసులు' ఎగవేస్తున్నారో ఆరా తీస్తుంది. సినిమా యజమానులుకూడా పరి



రవీఫిలింస్‌వారి 'కొండవీటి దొంగ' చిత్రంలో అంజలీదేవి.



బెంగాలీచిత్రం "గౌరి"లో నాయిక గీతాదత్ (రాయ్). దర్శక నిర్మాత గురుదత్ ఈమధ్యనే ఈచిత్రం ఆరంభించి, ఇటీవలనే విరమించుకొన్నారు

శీలన జరిపి, విద్యార్థులు ఏ ఆటలకు, ఏ చిత్రాలకు ఎక్కువగా వస్తున్నారూ, ఏ రకం చిత్రాలు చూచినపుడు ఎలా ప్రవర్తిస్తున్నారో తెలియ చెయ్యాలట. కాగా విద్యాలయానికి దగ్గర్లో ఉంటే సినిమా థియేటరు, దూరంగా ఉంటే దానికన్న ఎక్కువ బలంగల 'అయస్కాంతమూ' అనేదికూడా కనుక్కుంటారు.

* * *

డానీకేయీ నటించిన 'నాక్ ఆన్‌వుడ్' చిత్రాన్ని అనుకరించి నిర్మించారని ఆరోపిస్తు, 'దేఖనా' చిత్ర నిర్మాతలపై పారమౌంట్ వారు దావా వేసిన ఫలితంగా, న్యాయస్థానం వారు ఆ చిత్రం ప్రదర్శన నిషేధించారు. ఆచిత్రం ప్రతులు అన్నిటినీ (నెగటివ్ సహా) పారమౌంట్ వారికి ఒప్పగించాలనీ, దేశంలో ఎక్కడా దాన్ని ప్రదర్శించరాదనీ తీర్పు చెప్పారు. బొంబాయి రచయిత దర్శకుడు అయిన ఐ. ఎస్. జోహార్, ముక్కలుముక్కలుగా, పాటలు, సెట్లు, డైలాగులదగ్గర్నుండి 'నాక్ ఆన్‌వుడ్' చిత్రంలోంచి సంగ్రహించి 'దేఖనా' లో జాగ్రత్తగా పొందుపరచినట్లు పారమౌంట్ వారు ఆరోపించారు.

మన దర్శకనిర్మాతలు ఇలా అనుకరించడానికి ఇదే తొలిసారి కాదు గాని, కేంద్ర ప్రభుత్వం విదేశీచిత్రాల దిగుమతులనుబాగా తగ్గించి వేసినందువల్ల, వెచ్చుకునే నాలుగు చిత్రాలకూ, దేశవాళీ తర్జుమా చిత్రాల్తో పోటీ రావడాన్ని భరించలేక, విదేశీ నిర్మాతలు నిక్కచ్చిగా ఉండ నిశ్చయించు

కొన్నారు...వాళ్లమాట ఎలా ఉన్నా, మన మటుకు మనకుకూడా ఈ తరహా పనులు, ప్రయత్నాలు అందుకో తగ్గ తరహాకని, గర్వించ తగ్గ ఘనకార్యాలనీ అనిపించదు...

# హాలీవుడ్

'ఎక్స్‌ట్రా' వేషాలతో చలనచిత్ర జీవితం ఆరంభించి, కొంత పేరు దరిమిలా టెలివిజన్ నటిగా బోలెడు డబ్బు గడించిన హాలీవుడ్ నటి లసిలీబాల్, హాలీవుడ్‌లో అగ్రశ్రేణిదైన 'ఆర్. కె. ఓ.' స్టుడియోను మొన్న కొనేసింది. ఒకప్పుడు సరిగ్గా ఆ స్టుడియోలోనే ఆమె చిన్న వేషాలు అడగడానికి వచ్చింది. కొన్నాళ్లు శామ్యూల్ గోల్డ్విన్ చిత్రాలలో పని చేసింది. కొంతకాలం క్రితం, ఆమె, భర్త దేసి అర్నాజ్ కలసి 'డెసిలు' అనే కంపెనీ పెట్టారు.

* * *

ప్రపంచ ప్రఖ్యాతనటి ఇన్‌గ్రిడ్ బెర్గ్‌మన్, ఇటాలియన్ దర్శకుడు రాబర్టో రాసెలినీ విడాకులు ఇచ్చుకున్నారు. రోమ్‌లోని న్యాయస్థానం ఇందుకు అనుమతి జారీచేస్తూ, ఈ దంపతుల పిల్లలు ముగ్గుర్నీ తల్లికి ఒప్పగించింది. వాళ్లని యూరప్‌లో పెంచాలనీ, ఇటాలియన్ భాష నేర్పబడిలో చదివించాలనీ కూడా షరతుపెట్టింది. వాళ్ల పోషణకై, రాసెలినీ 6,00,000 లైరాలు (42 వేల రూపాయలు) ఇవ్వాలని కూడా తీర్పు చేశారు.

రాసెలినీ, ఇపుడు తిరిగి మన దేశంవచ్చి, లోగడ ఆరంభించిన డాక్యుమెంటరీ చిత్రాన్ని పూర్తిచేస్తారు. కేంద్ర సమాచార, ప్రసారశాఖకు డా॥ కేస్కర్ మంత్రిగా ఉండగా, భారతప్రభుత్వం ఈ చిత్ర నిర్మాణాన్ని రాసెలినీకిఒప్పగించింది. ఈ మధ్య, రాసెలినీని ప్రేమించి, భర్తను వదలివేసినదని చెప్పబడుతున్న సొనాలీహరిదాస్‌గుప్త అనే ఆమె ఈ చిత్రనిర్మాణం సందర్భంలోనే తొలిసారిగా ఈయనను కలుసుకొంది. 'స్క్రిప్టు' రచనకై, రాసెలినీ ఆమెను నెలకు ఐదువేల జీతంపై నియమించడం జరిగింది.

* * *

అమెరికన్ తారాకాశ స్టార్ రీటా హేవర్త్, ఈమధ్యనే ఐదవసారి పెళ్ళిచేసుకొంది. ఇంతక్రితం, ఈమెభర్త కీ. శే. ఆగాఖాన్ కుమారుడైన ఆలీ ఖాన్. ఆయనవల్ల రీటాకు ఒక కుమార్తె. ఆమెపేరు యాస్మిన్. అంతకుముందు వివాహాలవల్ల ముగ్గురు పిల్లలున్నారు. ఇపుడు రీటా ఐదవభర్త హాలీవుడ్ చలనచిత్ర దర్శకుడు జేమ్స్ హిల్. రీటా నటించిన కొత్తచిత్రం 'సెపరేట్

టెబుల్స్‌పై ఆయన దర్శకత్వం నిర్వహించారు.

## 'మదరిండియా'

మహబూబ్ చిత్రం 'మదరిండియా' ను ప్రధాని నెహ్రూ ఇటీవల చూశారు. నెహ్రూ కుమార్తె ఇందిరాగాంధీ కోరికపై, ఈ ప్రదర్శనం ఏర్పాటయింది. ఆమె ఇంతకు ముందే ఆ చిత్రాన్ని, నటి నర్గీస్ ను అభినందిస్తూ ఆమెకు లేఖ వ్రాసిందట.

ప్రధాని ఈ చిత్రం చూచి చాలా సంతోషించారట. బాగుందని మెచ్చుకున్నారట. ఇందులో కొన్ని భాగాలను తీసివేసి, నిడివి తగ్గించి విదేశాలలో ప్రదర్శించ తలచినట్లు దర్శక నిర్మాత మహబూబ్ ప్రధానికి చెప్పారు

'విదేశీయులకోసం ఈ చిత్రాన్ని కూర్చడం ఎందుకు వాళ్ళకు భారతీయ చిత్రం చూడాలని ఉంటే, మీరు తీసినదంతా చూస్తారు' అన్నారట ప్రధాని

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)★

# ★ సినిమా వార్తలు ★

1957 పేరు చెప్పి, 'తోడికోడళ్లు' చిత్రం సమర్పించిన అన్నపూర్ణా పిక్చర్స్ అధిపతి మధుసూదనరావుగారు, పై ఏటికి కొత్త చిత్రం సిద్ధం చేయడానికి ఈ నెల తొలి వారంలో, (6 వ తేదీన) కార్యక్రమం ఆరంభించారు. నిజానికి ఈ పని ఎనిమిది నెలలనాడే ఆరంభమైనా, నిర్మాణఘట్టం మొదలైనది ఇప్పుడే. గత ఎనిమిది మాసాలూ, కథారచన, పాత్రల రూపురేఖలు తీర్చిదిద్దటం, మాటలు పాటల రచన మొదలైనవన్నీ తాపీగా నే అయినా పూర్తిగా జరిగాయి. డిసెంబరు ఆఖరు, ఈనాడు పరిపాటి అయిన ఆర్భాటం ఏమీ లేకుండా పాటల రికార్డింగు ఆరంభమైంది. మధుసూదన రావుగారి సన్నిహిత మిత్రులు చక్రపాణి, కె. వి. రెడ్డి వచ్చి అభినందించారు. ముఖ్యనటుడు నాగేశ్వరరావు, నటి సావిత్రి వచ్చారు. ఆ రోజున, సుశీల, బృందం పాడిన పాటను, కృష్ణా రికార్డు చేశారు. వీరిద్దరూ నాగేశ్వరరావు సావిత్రి ధరించిన పాత్రలకు గాత్రధారులు. ఈ పాటను శ్రీ శ్రీ వ్రాశారు. ఆ తరువాత, అదే పాటను తమిళంలో రికార్డు చేశారు. తమిళ చిత్రానికి రచయిత నారాయణకవి. మర్నాడు సుశీల ఘంటసాల పాడిన యుగళ గీతం రికార్డు చేశారు. ఇదీ శ్రీ శ్రీ రచనే.

ఈ చిత్రానికి మాటలు ఆత్రేయ వ్రాశారు. పాటలు కొన్నిటిని కొసరాజు, మరికొన్ని శ్రీ శ్రీ వ్రాశారు. ఆత్రేయ ఒక

కె. అమర్‌నాథ్ కొత్తచిత్రం "కల్-హమారా-హై" లో మధుబాల, భరత్ భూషణ్



పాట వ్రాశారు. సంగీత దర్శకుడు వేణు.

'డిసెంబరు 20 న షూటింగ్ ఆరంభిస్తున్నాము' అని నిర్మాత మధుసూదనరావు తెలియచేశారు. బెంగాల్ లో బహుళ ప్రచారణకు పాత్రమైన కథ దీనికి ఆధారం. ఇందులో పాల్గొనే నటీనటులెవరో మీకు తెలుసు. తెలిసిన వాళ్ళుకాక, మొన్న నే ఒక కొత్తనటిని తీసుకొన్నారు. ఆ అమ్మాయి పేరు రాధిక. వాళ్ళది విశాఖపట్నం. ఆమెను 'పాండురంగమాహాత్మ్యం'లో సక్కుబాయిగా చూచి ఉంటారు. ఇప్పుడు అన్నపూర్ణావారి చిత్రంలో కొత్తనటుడు రమణమూర్తికి ఈ అమ్మాయి నాయకగా నటించబోతోంది.

రికార్డింగ్ పూర్తిఅవుతూ ఉండగా రేలంగి వచ్చారు.

'బాబా, మే మొదటివారంలో కాల్ షీట్ ఉంది. డైరీలో రాసుకోమంటున్నారు' అన్నారు నాగేశ్వరరావు.

"ఔట్ డోర్ ... ఊటీలో" అన్నారు మధుసూదనరావు.

"ఓ...అయితే రెడీయే...మే అంటే వేసం కాలంగా. అలా అయితే నెల్లాళ్ళు కాల్ షీట్" ఇచ్చేస్తాం అన్నారు రేలంగి నవ్వుతూ.

ఊటీలో షూటింగ్ కు నాగేశ్వరరావు, రంగారావు సావిత్రి రాజసులోచన రేలంగి వెళ్తారు. జూన్ ప్రాంతాలకు చిత్ర నిర్మాణం పూర్తిఅయి పోతుంది.

## విజయా స్టుడియో

విజయ ప్రొడక్షన్స్ వారు కొత్తగా కొన్న స్టుడియో (రేవతి) గుర్తింప వీలుకానంత చురుకుగా కొత్త రూపు ధరిస్తున్నది. వాహినీ స్టుడియోలో నుండి, ఇందులోకి చక్కని బాట వేస్తున్నారు. విశాలమైన లాన్లు వేస్తున్నారు. ఇక్కడి రెండు థియేటర్లను తెరలు అవీ మార్చేసి, చక్కగా అలంకరించారు. శబ్దప్రసారసాధకాలు కొత్తవి అమర్చి, రంగులు కూర్చారు. దాదాపు పునర్నిర్మాణం అవతగ్గ ఈ కార్యక్రమం రాత్రింబవళ్లు సాగుతూంది దీనికి 'విజయా స్టుడియోస్' అని నామకరణం చేశారు. 'రేవతీ' కొనగోలుతో, పరిశ్రమలో ఇలాటిప్రయత్నాలు మరి కొన్ని జరుగుతున్నట్లు తెలిసింది ఇంకో రెండు మూడు స్టుడియోలు ఒకటి రెండు వారాలలో చేతులు మారవచ్చును

## రామకృష్ణ జపాన్ ప్రయాణం

భరణీ స్టుడియోను ఎ ఎల్ ఎస్ ప్రొడక్షన్స్ అనే తమిళచిత్ర నిర్మాణసంస్థ ఐదేళ్లు కౌలుకు తీసుకొన్నది

భరణీ అధిపతి రామకృష్ణ కొత్త చిత్రం ఆరంభించేలోగా జపాన్ పర్యటనకు వెళ్ళి రావాలని నిశ్చయించుకున్నారు. ఈ నెల ఆఖరు వారంలో బయలుదేరి వెళ్ళి మూడు వారాలపాటు ఆదేశంలో పర్యటించివస్తారట. భానుమతికూడా వెళ్ళి ఉండవచ్చును గాని, ఇక్కడ పది పదిహేను చిత్రాలలో పనిరద్దీగా ఉన్నందువల్ల అటువంటి ఆలోచన పెట్టుకోలేదు

"అసలు నాకు విదేశీయాత్రలమీద ఆట్టే మోజు లేదు" అన్నదామె

* * *

డిసెంబరు 16 న జయంతి పిక్చర్స్ వారు షూటింగ్ ఆరంభిస్తూన్నారు. ఇందులో నాగేశ్వరరావు, జమున రేలంగి ముఖ్య నటులు రచయిత పింగళి నాగేంద్రరావు. సంగీతం ఘంటసాల సమకూర్చుతున్నారు. మూడుపాటలు రికార్డుచేశారు. ఈచిత్రానికి కె వి రెడ్డి దర్శకుడు.

* * *

విజయవారి "అప్పుచేసిపప్పుకూడు" నాలుగింట మూడుపాళ్లు పూర్తి కావచ్చింది. రామారావు, సావిత్రి రేలంగి పాల్గొంటున్న ఈచిత్రానికి దర్శకుడు ఎల్. వి ప్రసాద్. రచయిత సదాశివబ్రహ్మం, సంగీతం ఘంటసాల ఈచిత్రాన్ని ఏప్రిల్ లో విడుదల చేయటం జరుగవచ్చు.

* * *

దర్శక నిర్మాత శ్రీ పుల్లయ్యగారు,



రావెయిల్ వారి "షరారత్"లో కిశోర్, మీనాకుమారి



పొన్నలూరివారి 'శోభ'లో రాజసులోచన, ముక్కామల



ఎస్. డి. నరాంగ్ నిర్మిస్తున్న "ఢిల్లీకా ఠగ్"లో కిశోర్ కుమార్ - నూతన్

## సినిమా వార్తలు

పూర్వం తీసిన 'బాలాజీ' చిత్రాన్ని "శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యం" పేరిట పునర్నిర్మిస్తున్నారు. రచయిత ఆత్రేయ. రామారావు, సావిత్రి, రాగిణి పాల్గొంటున్నారు.

* * *

శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిమ్ కంపెనీ వారి "అన్న-తమ్ముడు" చిత్రం సంక్రాంతికి విడుదల కాగలదని తెలుస్తోంది. రామారావు, కె. మాలతి(పాతాళభైరవి), జగ్గయ్య నటించారు. దర్శకుడు సి. ఎస్. రావు. నిర్మాత కె. వెంకటేశ్వరరావు.

* * *

ప్రభా ప్రొడక్షన్సు వారి "ఆడపెత్తనం" ఆదుర్తి సుబ్బారావు దర్శకత్వాన పూర్తి కావచ్చింది. ఇంక పది కాల్ షీట్ల పని తరువాయి. నాగేశ్వరరావు, అంజలీదేవి, రేలంగి, సూర్యకాంతం, రమణారెడ్డి పాల్గొన్నారు. రచయిత పినిశెట్టి.

* * *

రవి ఫిలింస్ వారి "కొండవీటి దొంగ" సంక్రాంతికి విడుదల అవుతుంది. ఇందులో రంజన్, అంజలీదేవి, ఇ. వి. సరోజ నటించారు. రచయిత అనిసెట్టి. సంగీతం ఎం. ఎస్. శ్రీరాం, ఎస్. ఎల్. మర్చంట్. పర్యవేక్షణ రమేష్ నాయుడు. స్టుడియో ప్రకాష్.

* * *

దేశిరాజ్ ప్రొడక్షన్స్ అనే కొత్త సంస్థ ఒకటి ఇటీవల నెలకొన్నది. రంగస్థల, చలనచిత్ర నటుడు దేశిరాజు రామారావుగారు ఈ సంస్థ పేరిట తెలుగు తమిళ భాషలలో ఒక సాంఘిక చిత్రం నిర్మించనున్నారు. కథ, మాటలు యడవల్లి లక్ష్మీనారాయణ వ్రాస్తున్నారు. కళాదర్శకుడు సి. హెచ్. ఇ. ప్రసాద్. నృత్య దర్శకుడు కృష్ణరాజ్. షూటింగ్ జనవరిలో ఆరంభిస్తామని నిర్మాత తెలియజేశారు.

* * *

లలితా ఫిలింస్ అధిపతి శంకరరెడ్డి "లవకుశ" చిత్రాన్ని గేవాకలర్ లో నిర్మించబోతున్నారు. తెలుగు, తమిళ భాషలలో తయారయ్యే ఈ చిత్రంలో శ్రీరాముడుగా ఎన్. టి. రామారావు. జానకిగా అంజలీదేవి, వాల్మీకిగా నాగయ్య నటిస్తారు. రచయిత సదాశివబ్రహ్మం. దర్శకుడు సి. పుల్లయ్య.

## ఫిలింజర్నలిస్టుల సంఘం

దక్షిణభారత ఫిలిం జర్నలిస్టుల సంఘం వార్షిక సర్వసభ్య సమావేశం నవంబరు 24 న జరిగింది. కొత్త సంవత్సరానికి ఈ క్రింది వారితో కార్యవర్గాన్ని ఎన్నుకున్నారు. అధ్యక్షుడు కె. వాసుదేవన్, ఉపాధ్యక్షుడు ఎస్. టి. సుదర్శనాచార్య, కార్యదర్శులు ఎ. కరీం, పి.వి.జి. ఆనందన్, సభ్యులు ఎస్. జోసెఫ్, బి. వి. నరసింహారావు, కె. ఎస్. పార్థసారథి, టి. ఎస్. రత్నస్వామి, ఎస్. గోపి, ఎన్. కె. బాలకృష్ణన్.

## స్నేహితులు

ఫాక్స్ టెయిల్ ఫిలింస్ (బొంబాయి) వారు 'స్నేహితులు' అనే తెలుగు సాంఘిక చిత్రం నిర్మిస్తున్నారు. అక్టోబరు 30 న మూడు పాటలు రికార్డు చేశారు. రచన మునిపల్లె రాజు. సంగీతం రత్నారావు. దర్శకుడు సత్యవంతరావు. త్వరలో షూటింగ్ ఆరంభించనున్నట్లు నిర్మాతలు తెలియచేస్తున్నారు.

## 'జీవన జ్యోతి'

అశోక్ కుమార్, అనూప్ కుమార్, అమర్ నాథ్, మిర్జా ముషారఫ్, ఉషాకిరణ్, జబీన్, డెయిసీఇరానీ, హెలెన్ నటించిన డి. ఎన్. ఫిలింస్ వారి హిందీ చిత్రం "జీవన్ సాథీ"ని విజయలక్ష్మి ఫిలింస్ (బొంబాయి) వారు తెలుగులోకి డబ్ చేసి 'జీవన జ్యోతి' పేరిట విడుదల చేయబోతున్నారు.

చిత్రసమీక్షలు :

## ★ లాల్ బత్తీ ★

సినీ-కోఆపరేటివ్ వారి 'లాల్ బత్తీ' మొన్న బొంబాయిలో విడుదల అయింది. దోపిడీలు, గుండా పనులు ప్రధానంగాగల 'క్రైమ్ థ్రిల్లర్' తరహా కథలో, విసుగెత్తకుండా, హాస్యం పొందుపరచి వినోద కాలక్షేపానికి తగ్గ విధంగా తయారుచేసిన ఈ చిత్రంలో బల్ రాజ్ సాహ్నీ, శీలకళ, మాలాసిన్హా, జవహర్ కౌల్, సులోచన సీనియర్, రషీద్ ఖాన్, కమల్, పాల్ మహేంద్రా, బైజ్ శర్మ నటించారు. భారత దేశ విభజన జరిగిన సమయం కథాకాలం. అప్పటి అల్లర్లలో, అఘాయిత్యాలు సాగించే వాళ్ళకి, ఆయుధాలు సరఫరా చేసే ఒక ముఠాను పట్టుకోవడం ఇందులో చిత్రించారు. ఈ ముఠాకు ఒక మారుమూల రైల్వే స్టేషన్ దగ్గర రహస్య ఆయుధాగారం ఉంటుంది. ఒక పోలీసు అధికారి వాళ్ళని తరిమి తరిమి పట్టుకుంటాడు. స్వస్థలం ఢిల్లీ నుండి ఎక్కడికో పారిపోతున్న ప్రేమికుల జంట ఒకటి, లోభి అయిన ఒక వర్తకుడు, డబ్బు ఖర్చు అంటే బోలెడు సరదాగల అతగాడి భార్య, స్వతంత్రం ఇచ్చేస్తే ఈ దేశం బాగుపడదని నమ్మిన ఒక వృద్ధ ఆంగ్ల వనిత, దయ్యాలూ భూతాలూ ఉన్నాయని నమ్మే ఒక వెయిటరు, ఇందులో కనబడే వ్యక్తులు. వీళ్ళు కాక దొంగల ముఠా, వాళ్ళ నాయకుడు పాల్ మహేంద్రా ఉన్నారు; తరుమడానికి బల్ రాజ్ సాహ్నీ ఉన్నాడు.


రవి ఫిలింస్ వారి 'కొండవీటి దొంగ' చిత్రంలో రంజన్, తంగవేలు.


సారథి స్టుడియోస్ చిత్రం 'ఎత్తుకు పైఎత్తు'లో రేలంగి, లక్ష్మీరాజ్యం.


జలరుహా వారి "రాజనందిని"లో రామారావు, అంజలీదేవి

## లాల్ బత్తీ

కథ, అందులో పాత్రలూ చూస్తే, సమర్థుడైన దర్శకుడు దీన్ని అద్భుతమైనచిత్రంగా హాస్యరస ప్రధానంగా రూపొందించి వుండవచ్చుననిపిస్తుంది. అయితే, బిగువు బింకం లేని స్క్రీన్ప్లే, పసలేని సంభాషణలూ, అంత ప్రాప్తమై ఈ సత్ఫలితాన్ని సాధ్యం కానివ్వాయి కావు. దర్శకత్వం కూడా ఇందుకు ఏ విధంగానూ దోహదం చేయలేదు. ఫలితం: చిత్రం చప్పగా, విసుగెత్తించే విధంగా తయారైంది.

దర్శకత్వం పనిలేనందువల్ల, నటవర్గంలో ఏఒక్కరి కృషీకూడా రాణించలేదు. ఉన్నవాళ్ళలో బల్ రాజ్ సాహ్నీయే మెరుగు. నవ్వించడానికి అతడు చేసేచేష్టలు, నవ్వించే బదులు, అతని మనసులోని అసలు ఊహ (దొంగలను పట్టాలన్న కొంత) నే సూచించాయి. అతని ప్రేయసిగా శశికళ రాణించలేదు. లేచిపోతున్న ప్రేమికుల జంటగా మాలాసిన్హా, జవహర్ కౌల్ చేసిన నటనఅంతంతమాత్రంగా ఉంది. నవ్వించినవాళ్లు సేఠ్ దంపతులుగా నటించిన రషీద్ ఖాన్, కమల్ ఆంగ్లమహిళ పాత్రధారిణి సులోచన పీనియర్ లు. సంగీతం నేలబారుగా ఉంది. 'లిటిల్ బాలే ట్రూప్' వారి నృత్యం ఒకటి మటుకు కన్నుల పండువగా ఉంది.

(ఆంధ్రవారపత్రిక బొంబాయి విలేఖరి)

## 'తలవంచని వీరుడు'

మహారాణి అయినప్పటికీ, స్త్రీగా, ఆమెకు ప్రేమించటానికి, వివాహమాడేందుకు స్వేచ్ఛ, ఉండాలనేది, యీ 'తలవంచని వీరుడు' చిత్రానికి యితివృత్తం. కొండల్లో బొమ్మలు మలుచుకుంటూ, కాలం వెళ్ళబుచ్చే కళాతపస్వికి, అంతఃపురంలో విహరించే రాజకుమారి, హృదయాన్ని అర్పిస్తుంది.

రాజకుమారి అని తెలియనప్పుడు, ఆమె ప్రేమను అంగీకరించిన శిల్పి, ఆమె మహారాణి కాబోయే యువతి అని తెలుసుకున్నప్పుడు, ఆమె ప్రేమను తృణీకరిస్తాడు. తన తల్లికి, మానవతి అయిన కోడలు మాత్రమే కావాలి గాని, మహారాణి అవసరం లేదని కూడా ఖండితంగా చెప్పివేస్తాడు. శిల్పి ఆశయానికి అనుగుణంగా, రాజకుమారి, అతని తల్లికి చేదోడు వాదోడుగా ఉంటూ, సామాన్యయువతిలా నటిస్తుంది. ఈ యువతిని వివాహమాడేందుకు, శిల్పి చిత్రసేనుడు ముందు నిరాకరిస్తాడు. కాని తరువాత, ఆమె రాజకుమారి అని తెలుసుకొని, పెండ్లికి



విజయగోపాల్ ప్రొడక్షన్స్‌వారి "గంగాగౌరీ సంవాదం"లో నాగయ్య

అంగీకరిస్తాడు. వీరి ప్రేమకలాపాన్ని మొదటినుంచి గమనిస్తూ వచ్చిన సేనాధిపతి నరేంద్రుడు, వీరిద్దరూ వినోదంగా విహరించే సమయంలో, రాజును తీసుకొని వస్తాడు. చిత్రసేనుణ్ని బంధించవలసిందిగా రాజు ఆజ్ఞాపిస్తాడు. ఇంతలో రాజకుమారి ముందుకువచ్చి, స్త్రీగా శిల్పిని ప్రేమించే హక్కు తనకు ఉన్నదని వాదిస్తుంది. కాని రాజు అతనిని బంధిస్తాడు.

రాజకుమార్తె తనను ప్రోత్సహించిందని, తాము నిర్దోషులమనీ, చిత్రసేనుడి తల్లి వాదించి, ప్రజాసభ తీర్పును కోరుతుంది. చిత్రసేనుణ్ణి దేశభ్రష్టుణ్ని చేస్తూ సభ తీర్పు యిస్తుంది. రాజకుమారిని వివాహమాడేందుకు సేనాధిపతి కుట్ర, యీలోగా రాజకుమారి పలాయనం, చిత్రసేనుడు కోయ రాజ్యాధిపతి కావటం, మొదలైన సంఘటనలు జరుగుతవి. రాజకుమారి రూపంలో ఉండే కోయపడుచును రాజకుమారిగా అలంకరించి, వివాహానికి సిద్ధమౌతాడు సేనాధిపతి నరేంద్రుడు. ఇంతలో రాజకుమారితో సహా చిత్రసేనుడు ప్రత్యక్షమైనప్పుడు, రాజు, నరేంద్రుని కుట్రను గ్రహిస్తాడు. చిత్రసేనుడికి, నరేంద్రునికి మధ్య జరిగిన కత్తియుద్ధంలో నరేంద్రుడు మరణిస్తాడు. రాజు, తన కుమార్తెను చిత్రసేనునికి అప్పగిస్తాడు. వివాహంతో కథ సుఖంగా అంతమౌతుంది.

ఈ కథను 'రణంగాముడి' అనే పేరుతో



'మద్రాసు కల్చరల్ అకాడమీ'వారి తృతీయ నృత్యనాటకోత్సవాలు నవంబరు నాలుగో వారంలో జరిగాయి. నాటకపోటీలకు శ్రీ ఎస్. వి. రంగారావు, తమిళ దర్శకుడు ఎ. ఎస్. వి. స్వామి బహుమతి నిర్ణాయకులుగా వ్యవహరించారు. శ్రీమతి రాజసులోచన బహుమతులు పంచిపెట్టింది. ఉత్తమనాటక ప్రదర్శన (మాడర్న్ ఆర్ట్సు వారి తమిళ నాటకం లేడీ మైపెస్ట్)కు రోలింగ్ షీల్డ్ నందుకొంటున్న తెలుగునటుడు సూర్యకుమార్.

కరవణభవ, యూనిటీ పిక్చర్సు వారు, తమిళంలో తీయగా, నరసరాజు అండ్ కంపెనీ వారు 'తలవంచనివీరుడు'గా తెలుగులో సమర్పించారు.

తమిళ సంప్రదాయాలు స్వల్పంగా అక్కడక్కడ కనిపిస్తున్నా, కథను హృదయానికి హత్తేటట్లు చిత్రించారు. కొన్ని కొన్ని ఘట్టాల్లో శ్రీ శివాజీగణేశన్ నటన, సంభాషణలు కొంచెం నాటకఫక్కీలో వున్నాయనిపిస్తుంది. అయినా, తల్లిమరణం, తండ్రి ఉరికంబానికి ఎక్కబోయే సందర్భాలలో, యితని నటన కదిలించి వేస్తుంది.

తంగవేలు హాస్యం, శివాజీ గణేశన్ కత్తి యుద్ధం దృశ్యాలు, చిత్రం విజయానికి తోడ్పడుతవి. నటీనటులంతా సమర్థంగా నటించారు. సంగీతం, ఛాయాగ్రహణం బాగున్నవి.

శ్రీ పి. పుల్లయ్య యీ చిత్రానికి దర్శకత్వం వహించారు. మాటలు, పాటలు, శ్రీ శ్రీ కూర్చారు. నేపథ్య గాయకులు శ్రీమతి పి. లీల, శ్రీమతి జిక్కి, శ్రీమతి ఎమ్. యల్. వసంతకుమారి, శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావు, శ్రీ యమ్. యస్. రామారావు. ★

(ఎస్. వి. ఎ.)

## 'జనమ్ జనమ్ కె ఫేరే'

ముక్తి ఫిలింస్ వారి హిందీచిత్రం 'జనమ్ జనమ్ కె ఫేరే' (అను సతీ అన్నపూర్ణ) గతవారం మద్రాసు శ్రీ పద్మనాభ టాకీస్‌లో విడుదల అయింది దీనికి తెలుగులో వ్యాఖ్యానం చేర్చి చూపిస్తున్నారు.

భక్తురాలు, పతిభక్తురాలు అయిన సతీ అన్నపూర్ణ అనే యువతి బలవత్తర కష్టాలన్నిటినీ పాతివ్రత్య మహిమతో జయించుకొని, నాస్తికుడైన భర్తను దైవభక్తుడుగా మార్చివేయడం ఇందులో కథ. ఈ వృత్తాంతం మొదలుపెట్టినప్పుడు, దర్శకుడు మనూ దేశాయ్ ఊహ ఇదే నడవడానికి స్పష్టమైన నిదర్శనాలు ఉన్నాయి. కాని, పోనుపోను ఈ ఊహ మార్చుకుని, చిన్నచిన్న ఇంద్రజాలాలన్నీ అన్నపూర్ణకు ఒప్పగించి, ఆమె భర్తలో పరివర్తన సాధించే మహాత్కార్యాన్ని మటుకు, చచ్చిపోయి దయ్యమైన మామగారికి ఒప్పగించారు. చివరకి ఆనాస్తికుడికి భయంవల్లా, నరకంలో ఉన్న తండ్రి బాధ చూడడం వలని బాధవల్లా మనసు మారుతుంది. అనక అతడు సన్యసించి హరిదర్శనం కోసం బయలుదేరిపోతాడు. ఈలోగా రాజా, పూజారివంటి స్థానిక దుర్మార్గులే కాక, ఒక నాగకన్య కూడా ఆమెను హింసించ పూనుకొంటుంది. చివరకు సతీ అన్నపూర్ణ విష్ణుమూర్తి సలహాపై సోమవారం వ్రతంచేసి విజయం సాధిస్తుంది.

ఈ చిత్రంలో అన్నపూర్ణగా నిరూపరాయ్, ఆమెభర్తగా మనహర్ దేశాయ్, నాగకన్యగా కృష్ణకుమారి నటించారు.

రెండు మూడు పాటలు చాలాబాగున్నాయి. రఫీ, లతా, మన్నాడే పాడారు. సంగీత దర్శకుడు ఎస్. ఎన్. త్రిపాఠీ, మీ అభిమాన సంగీత దర్శకులందరూ జ్ఞాపకం వచ్చే విధంగా సంగీతం కూర్చారు.

భక్త విజయగాథల మీద అభిమానం ఉన్నవారంతా వెళ్ళి చూడవచ్చు.

## 'సతీ అనసూయ'

రాజశ్రీవారి పౌరాణిక చిత్రం 'సతీ అనసూయ'ను ఇటీవల మద్రాసు పారగన్‌లో చలనచిత్ర ప్రముఖులకు, పత్రికలవారికి చూపించారు. దర్శకుడు కె. బి. నాగభూషణం, సహాదర్శకుడు మల్లికార్జునరావు, రచయిత సముద్రాల రాఘవాచార్య. పాతివ్రత్యమహిమకు త్రిభువనాలలోను ఎదురులేదని చాటిన మహాపతివ్రత అనసూయ కథతో పాటు, సూర్యగమనాన్ని అరికట్టి (అరికట్టడం సూర్యగమనానికిమాత్రమే వర్తిస్తుందని గ్రహించ ప్రార్థన) మాంగల్యం కాపాడుకొన్న నర్మద అనే మరొకపతివ్రత కథకూడా ఇందులో చిత్రించారు. వీటికి దీటుగా, హేళనకు వేరే ఆస్కారం లేకుండా మహాపతివ్రతుడైన మరో అసామి కథను అహ్లాదకరంగా రూపొందించి, ఇందులో చక్కగా కలిపారు. ఈ ఇతివృత్తానికి ప్రాతిపదిక పార్వతీగర్వభంగం. పార్వతీపతిపట్ల పార్వతి పతిభక్తిలో ఒక్క రవ్వ అహంకారం మిళితమైనందువల్ల ఆదేవి, ఒకసారి ఎదట తలవంచవలసి వచ్చింది. నిండు మనసుతో ప్రేమించి పూజించేవారే లోకపూజ్యులు అవుతారు అని ఈ చిత్రం నిరూపించింది. ఈ కథ, ఈనీతి తెలిసినదే అయినా, నమ్మి గౌరవించ మనసయే విధంగా అనసూయ, (అంజలీదేవి) ఆమెభర్త (గుమ్మడి), నర్మద (జమున) దీని చెప్పుకొచ్చాడు. నర్మద భర్తగా కె. వి. ఎస్. శర్మకూడా మంచి నటన ప్రదర్శించాడు. పై ముగ్గురూ దేవలోకవాసులకు ఉండతగ్గ నిండుతనాన్ని, తేజస్సును, నిగ్రహాన్ని, తమను పూర్తిగా అపహరించి తమలో నిలుపుకొన్నారు. అందువల్ల, దేవతలయుద్ధవిభాగంలో కనబడే పాత్రలు ప్రహసనంలో శాల్తీలుగా గోచరిస్తాయి. వారిలో విష్ణుమూర్తి పాత్రధారి కాంతారావు, నారదుడు పద్మనాభం బాగున్నారు. రేలంగి హుషారుగా నటించాడు. అతురాలా మనోహరంగా ఉన్న మరో ముగ్గురు నటులు ఈచిత్రంచివర ఊయలతొట్లలో కనబడి ముద్దొచ్చేలా నవ్వే పసిపాపలు. ఇంతవరకు మన చిత్రాలలో

## ప్రసాద్ ప్రొడక్షన్స్ వారి

# ★ శారద ★

తెలుగు చలనచిత్ర దర్శకనిర్మాత ఎల్.వి. ప్రసాద్ బొంబాయిలో నిర్మించిన తొలి హిందీచిత్రం 'శారద'ను మొన్న ఆదివారం సాయంకాలం విజయాస్టుడియోస్‌లో ప్రదర్శించారు. తెలుగు చలనచిత్ర నిర్మాతలూ, కళాకారులూ, టెక్నిషియన్‌లూ పలువురు వచ్చారు. ప్రదర్శనం రెండు థియేటర్లలో జరిగింది.

రాజ్‌కపూర్, మీనాకుమారి, శ్యామ, ఆగా, అనితాగుహ, రాజ్ మెహ్రా, ఓంప్రకాష్, మనోరమ, కె. ఎన్. గోష్, అల్లురామలింగయ్య, ఇందులో పాల్గొన్నారు. కథ సదాశివబ్రహ్మం, పినిశెట్టి వ్రాశారు. మాటలు విశ్వామిత్ర ఆదిల్, పాటలు రాజేంద్రకిషన్, వ్రాశారు. సంగీత దర్శకుడు సి. రామచంద్ర; ఛాయాగ్రహణం ముకాదం. దర్శకుడు ఎల్. వి. ప్రసాద్.

శతదినోత్సవాలు జరుపుకున్న తెలుగు చిత్రం 'ఇలవేలుపు' దీనికి ఆధారం. అందులో ముఖ్యవృత్తాంతానికి ప్రాధాన్యం ఇచ్చి, ఉపవృత్తాన్ని, అనవసరం అనిపించే సన్నివేశాలను తగ్గించి, 16 వేల అడుగులలో ఈహిందీకథనుచురుకుగా నడిపించారు. ఈ కథలో సమస్య, తెల్లారిలేస్తే ఎక్కడపడితే అక్కడకనబడేదీ వినబడేదీ కాదు. అరుదుగా జరగడంకూడా బహు అరుదు. చిత్రవిచిత్ర పరిస్థితులలో, దురూహ్యమనతగ్గ సమస్యల మధ్య, దుర్భేద్యమైన కట్టుబాట్లు చుట్టుముట్టినపుడు మానవహృదయం ఎంతక్షోభిస్తుందో చూపారు. కోరికలకు లొంగి కట్టుతప్పిపోయి ప్రవర్తిస్తే కథేలేదు. శారదకథ అలాటిపనిచేయవద్దని మాటిగా నీతివాక్యాలు వల్లించడంలేదు. విధివశాత్తు, విలక్షణమైన పరిస్థితులు సంప్రాప్తమైనపుడు ఒకమనిషి, మనసు ఎంతక్షోభపడుతుందో తెలియచెబుతుంది. దర్శకుడు ప్రసాద్‌గారు ఈలక్ష్యంతోనే ఈ కథ చిత్రణకు ఉపక్రమించి, వర్ణనాతీతమైన హృదయ సంక్షోభానికి గొప్ప రూపకల్పన చేశారు.

మృత్యువును చేష్టలు, పూర్తిగా వదలని శేఖర్ అనే చిన్నవాడు, చైనా వెళ్తున్న సాంస్కృతిక ప్రతినిధి వర్గంలో సభ్యుడు అవుతాడు. చైనా వెళ్ళేలోగా శారద అనే అమ్మాయిని చూచి ప్రేమిస్తాడు. యుగళగీతంపాడేలోగానే విమానంమీద చైనా బయల్దేరుతాడు. చైనా చేరేలోగానే విమానం ప్రమాదవశాత్తు కొండలమధ్య నుంచే కోయవాళ్ళ డాన్సు సెట్‌కుదగ్గరగా నేలకూలుతుంది. శేఖర్ తండ్రి, శారదా వాళ్ళు పత్రికలో ఆ వార్త చూచి, శేఖర్ పోయాడనుకుంటారు. శేఖర్ తండ్రికి పిల్లలకూ ప్రకృతి వైద్య విధానాలద్వారా సేవచేసి, వారి గౌరవాభిమానాలు చూరగొన్న శారద పెద్దాయనను పెళ్ళిచేసుకొంటుంది. శారదతత్వం అటువంటిది కాదు ఆమె తొందరపడదు. అయినా కథ బలీయం. శేఖర్‌ను ప్రేమించిన ఇంకో అమ్మాయి, (శ్యామ) మటుకు, అతను తిరిగివస్తాడని కాబోలు ఆగుతుంది. సరే అతడు వస్తాడు. ఇంతవరకూ కథ ఏర్పాటు ఈ విధంగా కొంత అసహజం అనిపించేలా, ఆయా వ్యక్తుల స్వభావాలకు అమోఘంగా అతకదు అనిపించేలాఉన్నా, తరువాత కథా, కథనం చూస్తే ఇవి పట్టించుకొతగని పొరపాట్లు అనిపిస్తాయి. ఈ చిత్రం ఉద్దేశ్యం కూడా జీవితంలో అతిసహజమైన సంఘటనలను, పరిస్థితులనూ చిత్రించడం కాదు. విలక్షణమైన సమస్య ఇందులో ప్రధానం. ఆ సమస్య ఇక్కడే ప్రారంభం అవుతుంది. ప్రారంభమైన క్షణంనుండి, దాని విశ్వరూపాన్ని చూపేపర్యంతం, కథ ఎక్కడా పట్టు తప్పకుండా ప్రేక్షకులను మంత్రముగ్ధుల్ని చేస్తున్నట్టు తీవిగా నడుస్తుంది. కథ సారథి ప్రసాద్‌గారు ఈ విభాగంలో ప్రతి సన్నివేశాన్ని ప్రతిభావంతంగా చిత్రించారు. బొంబాయి చిత్రాలలో ఈ స్థాయి అరుదుగా కనబడుతుంది. దర్శకుడి ప్రయత్నం ఫలప్రదం కావడానికి మీనాకుమారి నటన ప్రధానకారణం: బాధ భరించరానిదైనపుడు, నివారించరానిదైనపుడూ ప్రవర్తిల్లే నిర్వికారమనస్కతను ఆమె అద్భుతంగా ప్రదర్శించింది. సహనటుడు రాజ్‌కపూర్ విషయంలో ఈ భావం అంతగా కలుగదు. ఆట్టేసేపు నిలువదు. కారణం, విలక్షణమూ, అసాధారణమూ అయిన శేఖర్‌పాత్ర స్వరూపస్వభావాలను పాటించడం కన్న, దానిపై రాజ్‌కపూర్, వ్యక్తిగా తనముద్రవేశాడు. మామూలు చిత్రాలలో, పరిపాటిగా ప్రదర్శించే తరహానే ఇందులోనూ చాలవరకు ప్రదర్శించాడు. ఉత్తరార్ధంలో ఉద్వేగప్రధానమైన సన్నివేశాలలో మటుకు రాజ్‌కపూర్ నటనలో చెప్పకోతగ్గ నిగ్రహం కనబడుతుంది. ప్రియురాలుగా భావించిన యువతిలో తన తల్లినిచూడడం నేర్చుకొని, మనస్ఫూర్తిగా అమ్మఅని పిలువగలిగిన తరువాత కూడా, అతడు ఇంకా వర్ణనాతీతమైన బాధను అనుభవిస్తున్నట్లు విచారాక్రాంత వదనుడై తిరగడం సంభావ్యం అనిపించదు. ఇతర నటులు, అంతా తమ పాత్రలను యథోచితంగా పోషించారు. దర్శకుడు ప్రసాద్, నటనలోగాని, సన్నివేశాల చిత్రణలోగాని, ఎక్కడా మితి దాటడానికి, లేనిపోని చాదస్తాలకు – అవకాశం ఇవ్వలేదు. అసలు కథకు సమాంతరంగా వచ్చిన చిన్నకథ బాగుంది. అందులో అనితాగుహ చక్కగా నటించింది.

ఈ చిత్రంలో పాటలు కథకి అడ్డొచ్చాయనిపించేలా ఉన్నాయి. లతా, ఆశాభోస్లే పాడిన యుగళగీతి మటుకు చాలా బాగుంది. చూడతగ్గ చిత్రం. 

---

## సతీ అనసూయ

చిన్నపిల్లల్ని అంత చక్కగా చూపించినవారు లేరు. ఆ ఘట్టంలో సముద్రాలవారు సంభాషణలు ఆ పిల్లల నవ్వును, నటనను చూచే వ్రాశారో, వాళ్ళు ఈ సంభాషణలు చదువుకునే అంత చక్కగా నటించారో తెలియదు. ఛాయాగ్రహణ దర్శకుడు కమల్ ఘోష్ చక్కని ప్రకృతి దృశ్యాలను చిత్రించారు.

కథాచిత్రణలో ముఖ్యంగా శివానంద పాత్రధారి ముక్కామల దౌర్జన్యప్రవృత్తిని చూపేఘట్టాలలో ఆ నటుడి నటనకు ఛాయాగ్రహణశిల్పంతోడై, వాటిని ఉత్తమశ్రేణి ఘట్టాలలో చేర్చింది... ఈ చిత్రానికి పాటలు సముద్రాల జూనియర్, కొసరాజు వ్రాశారు. ఘంటసాల శ్రుతిపేయమైన సంగీతం సమకూర్చారు.

★




Printec ano Publisheo 'or Nageswara Rac Estates (Private) Ltd., by S. Radha krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street Madras-1 Editor S Samthu Prasad



"గజచర్మాంబరధర" శిల్పం
[హ ళే బీ డు]

ఫోటో : వి. కేశవర్మ